# కృష్ణలీల

చక్రావధానుల మాణిక్యశర్మ



గోదావరీ బుక్ డిపో

రాజమహేంద్రవరము

౦రు.

రు ౧-౦-౦

శ్రీ రస్తు.

సంగీత

# కృష్ణలీల



ఇది

చక్రావధానుల మాణిక్యశర్మగారిచే

రచియింపఁబడినది.

1000 ప్రతులు.


కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

కె. యల్. యన్. సోమయాజులుగారిచే

ప్రకటింపఁబడియె.

1924.

దీని వెల 1-0-0.]

[రిజష్టర్డు కాపీరైటు.


నన్నవర

# శ్రీకృష్ణలీలానాటకమున వచ్చు పాత్రలు

## పురుషులు.

1. దేవకుడు.
2. కంసుడు.
3. నారదుడు.
4. శంభుడు.
5. వసుదేవుడు.
6. దీర్ఘనేత్రుడు.
7. బ్రహ్మ.
8. ఇంద్రుడు.
9. విష్ణువు
10. నందుడు.
11. నలకూబరుడు.
12. మణిగ్రీవుడు.
13. బహుళోదరుడు.
14. సేవకుడు.
15. తృణావర్తుడు.
16. బలరాముడు.
17. గోవిందుడు.
18. కృష్ణుడు.
19. అక్రూరుడు.
20. ఉగ్రసేనుడు.

[illegible] కాళీయుడు.

[illegible]ఘాసురుడు.

[illegible]ందుడు.

## స్త్రీలు.

1. దేవకి.
2. రక్తాక్షి.
3. యోగమాయ.
4. పూతన.
5. యశోద.
6. రోహిణి.
7. సారసిక.
8. పల్లవాధరి.
9. చంద్రవదన.
10. నాగకాంతలు.
11. మునిపత్నులు.

# నాంది.



రంజిల్లగ ధాత్రిదేవి యసుగో ద్రేకంబు సైరింపగా
నేరంజాలక విష్ణువేష రిపులన్ సర్జింపగా భూమి నా
భీరోదారకులమ్మునన్ బొడమి గోపీలోకమున్మోహములన్
గారుణ్యంబున నేలు కృష్ణుడిలకున్ గళ్యాణముల్గూర్చుతన్ ||

[సూత్రధారుడు పూవులను సభమీద జల్లి]

సూత్ర—ఓహో! ఈసభాలంకారము కన్నులపండువు సేయుచున్నదే! సకలజగజ్జన జేగీయమానాగమాంత రహస్యవేదులును, సర్వకళారహస్యవిదులును, భంగీకృత పరశురామ గర్వవిశేషమహీపాలకుమారతిలకులును, ధనధాన్య సంపద్విభూషితులును అగు నీసదస్యులు మే మొనరింపదలచిన నాటక ప్రయోగమునకై నిరీక్షించుచున్నవారు కావున వీరి నానందపఱచుటకు భగవంతుని లీలారూపకమైన నాటకమును బ్రదర్శించుటకై మానటిని బిలచి పాత్రల సిద్ధపఱచెదను గాక. (తెరవంకజూచి) ప్రేయసీ! ఒకసారి యిటురమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యా! ఇదిగో వచ్చితి నేమియాజ్ఞయో నియోగింపుడు.

సూత్ర—ప్రియురాల! ఆవిధంబుగ మన మాడదలచిన నాటకమును జూచి యానందించుటకై సభ్యు లెదురుసూచుచుండ నేమి యాజ్ఞ యని యడిగెద వేల?

నటి—జీవితేశ్వర! అందుల కిప్పుడే నాటకమును బ్రయోగింపదలచితిరో చెప్పెదరేని పాత్రవర్గమును సిద్ధపఱచెదను.

సూత్ర—మనోహారీ! ఇదిగో చెప్పెద వినుము.

చనారు.
నన్నవర

గీ. చిన్ని ప్రాదేని రుచికల్గి । మన్ననలకు
పాత్రమై పాపహరమైన । పరమయోగి
బాలకృష్ణుని లీలయే । ప్రాపుకాదె
ఫలనము సేయు మనకిట । సీలవేసి.

నటి—అలాగే. చకోరములు చంద్రికవలన గాక వేఱొకదానిచే సంతో
షించునా! కాని యాభగవంతుడైన శ్రీకృష్ణుని లీల లనేకులు
రూపకములుగ రచించియున్నవారు. ఏందేని విరచించిన నాట
కమును ప్రయోగించుదము.

సూత్ర—ప్రేయసీ! అనేక నాటకములు రచించి ప్రసిద్ధివడసిన బ్రహ్మశ్రీ
చర్లప్రధానుల మాణిక్యశర్మగారు రామలీల, కృష్ణలీల, విష్ణు
లీల అను లీలాత్రయమును నాటకములుగ రచించి ప్రపంచ
మున కొసంగినారని వినలేదా! అందు శ్రీకృష్ణలీలను నేడను
సరింతము. నీవును వసంతమును గూర్చి యొకసారి గానము
సేయుము.

నటి—చిత్తము.

గీ. మురళికారవమును జగ । న్మోహనముగ
బాలకృష్ణుడు సేయగో । పసతులెల్ల
మారశర భిన్నలై నటు । మాధవుండు
చెలగిలోకుల విరహాగ్ని । శిఖలముంచె.

సూత్ర—ప్రియురాల! చక్కగ బాడి సదస్యుల హృదయముల బల్ల
వింపజేసితివి. రమ్ము వేగ నాటకము నారంభించుదము. అల్లదే
దేవక వేషమునుదాల్చి మన కుశలవుడు దేవకీదేవి నత్తవారిం
టికి బంపు ప్రయత్నములో నున్నట్లు సందడియగుచున్నది
రమ్ము పోవుదము. (ఇద్దరు నిష్క్రమించెదరు.)

ఇది ప్రస్తావన.





శ్రీ

# సంగీత కృష్ణలీల.



ప్రథమాంకము.



రంగము:— మథురాపుర బాహ్యసీమ.

[దేవకుఁడు, దేవకీ వసుదేవులును ప్రవేశించెదరు.]

దేవకు— ప్రియా! దేవకి!

చ. పతినిసతమ్ము దైవముగ । భావనచేయుగదమ్మ, బాంధవ
తతులను సత్తమాంగులను । దాసులలీల ధరింపుమమ్మ, యో
కలకును బోకుమమ్మ, పతి । దుష్టతనమ్ముగ మాటలాడినన్
జతురమతిన్ బ్రశాంతిగని । సత్కృపఁగాంచుము భర్తృసేవలన్॥

దేవకి— స్వామీ!

గీ. అఖిల ధర్మార్థవిదుడవైన । నట్టినీకు
దనయనై భర్తకెదురాడ । దలతునయ్య.
మీసుబోధన మదినెంచి । మెలగుదాన
హరికిశోరము చనునయ్య! । అల్పములకు.

వసుదే— పూజ్యుడా! మీరింతవరకే మిపుల దూరము వచ్చినారు. మీరింక నిలచిపోండు నాప్రార్థన నొక్క౯ డాలింపుడు. నన్నవర

తము స్వపుత్రునివలె నాదరించుచు నప్పుడప్పుడు వచ్చి మా సేమ మరయుచుండవలయునని ప్రార్థించుచున్నవాడను.

దేవకు—వసుదేవా ! మీ క్షేమ మరయుచుందును కాని

సీ. కనుబొమల్ విరచినం తనెభీతిగంపిల్లు
నతిభీరురాలు నా యాత్మజాత
గృహకార్యముల సేయు రీతి నెఱింగిన
చతురకాదయ్య మా చంటిపిల్ల
ప్రౌఢవాక్యములకు బ్రతివచనంబీయ
జాణకాదయ్యయీ సఖియ మిన్న
చంద్రికాంతులకైన సైచి నిర్వ్యగలేని
సుకుమారి మాతల్లి సుగుణవల్లి

గీ. అట్టి యబలను నీకు నే నర్పణంబు
చేసినాడను సామము చేతనీవు
బుజ్జగించుచు దగినట్లు బుద్ధి చెప్పి
యేలరణి సత్కృపామతి నేలుకొనెదొ.

వసుదే—ఆర్యా ! మీరింతగా జెప్పనవసరము లేదు. మావంశమునకు జంద్రరేఖయనదగిన సీమెను మీరు చెప్పినటులే దిద్దుకొనెదను.

దేవకు—అమ్మాయి దేవకి .

గీ. కమలమును బ్రెంప గలహంస కాడనుండి
దారమేగిన యట్టులో తల్లి ! నీవు
నన్ను విడనాడి పోవుచో నామనోబ్జ
ముకుళమును నీదు వెంటనే పోవదొడగె.

దేవకి—జనకా విచారింపకుడు. కరుణామయుల హృదయము లట్లుం డుట సహజమే! నన్ను మీరు తరుచు వచ్చి చూచుచుండుడు. పూజ్యురాండ్రి కందఱకు నావందనములని చెప్పుడు.

దేవకు—తల్లీ ! అట్లే చెప్పెదను.
దేవకి—తండ్రీ ! తిరిగి నేను పుట్టిన యింటికెప్పుడు వచ్చెదనోకదా !
దేవకు— అమ్మాయి ! నీవచిరకాలముననే వచ్చెదవుగాక.

గీ. విష్ణుగర్భమైన ౹ విశ్వంబు కరణిని
సుగుణరాశి బుత్రి ౹ శూరవరుని
గర్భమందు నెపుడు ౹ కాంతువో యప్పుడే
పుట్టినింటివసతి ౹ బొందెదమ్మ.

అల్లదే రథనేమిధ్వని వినిపించుచున్నది. నీయగ్రజుండు కంసుడు రథము నాయత్తపఱచి తెచ్చినాడు. మీరిద్దాని నధిష్ఠించి సుఖమ్మున బోవుదురు కాక మఱియు మధ్యమార్గంబున.

గీ. మంగళకరమ్ముగా గాలి ౹ మలయుగాక
పక్షి కులరావములు శుభ ౹ ప్రదములగుత
లాజలను చల్లినట్టులీ ౹ లతికలెల్ల
పుత్రి ! నీమీద వెదజల్లు ౹ పూలగములు॥

కంసుడు—(రథముతో ప్రవేశించి) తండ్రీ ! మాచెల్లెలి నత్తవారింటికి బంపుటకై రథము నలంకరించి తెచ్చినాను.
దేవకు—కంసకుమారా! రథమునుబహుభద్రముగ దోలుకొనిపొమ్ము.
కంసు—జనకా ! నేనీరథము నెట్లు నడిపెదనో చెప్పెద నాలకింపుడు.

ఉ. కాంచనరత్నభూషణలు ౹ కాంతులఁ దురంగము లేక రేఖమై
మించెడు మించుదీవవలె ౹ మేదినిపై వెలుగన్ మనోజవో
దంచిత వేగమై ధ్వజప ౹ టాదులు చిత్తరు వట్టులొప్పనా
సంచిత విద్యతేటపడ ౹ స్యందనమున్ నడిపింతు వేడ్కమై.

[ తెరలో ]

క. పెల్లున బొంగుచు వీరల
కుల్లాసము గొలుపరథము ౹ నుఱికించెదు నీ

చెల్లెలి యష్టమ గర్భము
తుత్తుళ్ళడగగ జేయునిన్ను । దుర్మతీకంసా.

కంసుడు—(ఆగ్రహముతో ఆకసము జూచి)

గీ. ఎవ్వడవురోరి పేర్లెద । నీవిధమున
నీదు నాలుక జీల్చెద । నిలువు మెదుట
మహిత విక్రమ ఘనుఁడా । మరచయుండ
భువనముల నన్ను గెల్చెడు । పురుషు డెవడు.

అందరు—(భయము నభినయింతురు.)

కంసుడు—(మీసము మెలివేయుచు) ఛీ! ఏమిరా! తీసుమ్రిడా! ప్రతి
శ్రుతి నీయకుంటివి.

మ. ధరణీచక్రము బూదియైన, మరు । ద్ధారాధరేంద్రంబు భీ
కరలీలన్ దలక్రిందులైన, రవి తా । కాచంద్రులున్ డుల్లినన్
శరధుల్ ఘూర్ణిలి నీరమింకినను జా । జ్వల్యాగ్ని చల్లారినన్
వర బాహా విభవాంకు కంసు నసురల్ । బాపంగ నెవ్వాడురా.

[తెరలో]

నీప్రాణములు తీయువారితరులుకారు. నీచెల్లెలి యష్టమ గర్భమే
నీమేనల్లుడు.

కంసు—ఏమీ! ఆలాగునా! ఓ అసంబద్ధ ప్రలాపిని!! అశరీరిణీ!!!

గీ. మేనులేక చదల । మెలగుచు మాబోటి
యధిక తేజమయుల । నల్పులనుచు
నొంచిపల్కు నీదు । హీనపు వాగ్ధాటి
యడగుగాక నా శ । రాగ్ని నిపుడె.

(బాణము సంధింప నాశరము జారి క్రిందబడును) ఔరా! ఏమిది.
నా శరము జారిపోయినదే. మంచిది! ఈయవశకునముతో న కు నిమి

త్తమేలకు? ఈయుశరీరవాంఛతో బనియేల? కానిమ్ము నా మరణహేతువైన దేవకినే వధించెదనుగాక (ఖడ్గముసెత్తి) ఓసీ! దేవకీ!

గీ. సోదరీరూపమును దాల్చి । సోదరునను
ప్రాణములదీయునట్టి య । గ్గకు గాంచ
నున్న నిన్నిప్పుడే చంపు । దుక్కుమిగిలి
వృక్షమును జంప బొడముసే । విషఫలంబు.

(నరుకబోవును.)

దేవకి—(దేవకుని వెనుకకుబోయి) హాతండ్రీ! రక్షించుమురక్షించుము.

దేవకు—నాయన! కంసకుమార! ఏల యాగ్రహించెదవు. తాళుము. తాళుము.

గీ. గాలి మాటలకిట్టు లా । గ్రహము జెంది
సోదరిని జంప చూచుట । శూరగుణమె
అధిక విక్రమశాలి నీ । వాగ్రహింప
నిలుతుమే! కంధిగుటిదాట । గలదె బ్రతుకు!

(వారించును.)

కంసు—నన్ను వారింపకుము తొలగుము.

ఉ. దేవక! నీవకా దఖల । దేవగణంబులచో దిగినేత్రి
భావజవైరివచ్చి నను । బ్రార్థన జేసినగాని యిప్డు నా
జీవములన్ హరింపగల । చిన్నికుమారుని గాంచనున్న నీ
దేవకి కంఠనాళమును । ద్రెంపక యేల త్యజింతు వెఱ్ఱినై.

వసుదే—బావ! వచ్చిన యాగ్రహం బంతయు గనబరచువా! శాంతింతింపుము.

గీ. బరుల నకరీరి కల్కి న కుల్కలకును
కలగి యీరీతి దీర్ఘంబు గగబరతువె !
స్త్రీవధమె పాపహేతువై చెలగు నందు
జెల్లెలినిజంపు దోషంబు జెప్పదరమె.

కంసు—వసుదేవ ! నీవు నాకు బావమరదివియు గావు. ఈమె నాసో దరియు గాదు.

ఉ. మామక ప్రాణసంతతికి మారణ కారణి యైన దేవకిన్
ప్రేమదలంచి చంపకెటు వీడను మృత్యువటంచెఱింగియున్
బాముకు గంతమందు సుమ బంధముగా ధరియించికొందురే !
యేమెయి బాధుభావమెన యింతురు మృత్యువుగాంచి వెఱ్ఱులై.

కావున నేనీమెను వధించి తీరెదను ప్రాణముల కాశించితిరేని మీరు తొలగిపొండు.

దేవకు—నాయనా ! కంసకుమార ! రక్షించుము ! రక్షించుము.

గీ. తమ్ముని కుమారుడవు కావు దైవమీవె
నాకు, నీపదములబడి నాడ జమ్ము
కన్నబిడ్డను జంపనే కరణి మనుకు
గాన మును నన్ను జంపుము ఖడ్గమునను.

కంసు—దేవకి ! నిష్కారణము జచ్చెదవు సుమి ! తొలంగుము.

క. పితృహంతయనుచు దలపను
పతివధమఘుమంచు నెంచ స్వాంతంబుననో
మతిహీన ! నాదు ఖడ్గపు
హతిచేఁ జావంగనేల యవలకుబొమ్మా !

వసుదే—మరది ! అందరము నీచేతిలోని వారమే. నీవిప్పుడు కాకున్న మరొక్కప్పుడైన మమ్ముల జంపగలవు. కొంచెము శాంతి వహించి నాపలుకుల విన్నుము.

గీ. కల్లయో ! సత్యమో మింట ౯ గల్గినట్టి
యొక్క ధ్వనిచేత జెల్లెలి ౯ నువిదమిన్న
జంపి స్త్రీహత్య గొనుట నీ ౯ శౌర్యమునకు
ఘనకళంకము సుమ్మి యో ౯ కంసపుత్రి !

కంసు—ఓరీ ! వసుదేవ ! నీధర్మపన్నముల నాచెంత వర్ణింపకుము. ఆవిధంబుగ నశరీరవాణి నాచెవులు చిల్లులువడ నాహృదయ కవాటంబు భేదిల్ల నాచెల్లెలి యష్టమ గర్భము నన్ను సంహరించునని బలుక భార్యామోహంబున నీవును పుత్రికా ప్రేమచే నీదేవకుడును స్త్రీహత్య సేయుట మహాపాతకమని చెప్పి నంతనే విడచి యీదేవకి నీసోదరమారకురాలిని నాకృపాణంబున కెఱజేసి విశ్రాంతి జెందక మృత్యుదేవతను చేచేతల బెంచుకొందు ననుకొంటివా ! ఇదే చూడుము. దేవకి చచ్చిన దని తలంపుము (నరుకబోవును.)

వసుదే—(అడ్డుపోయి) ఓగ్రిసేన! తాళుము నీకిదేమి వెర్రి. ఆ యశరీరి పల్కుల నిక్కములని తలంచి చేయరాని హత్యనుజేయ సిద్ధపడుచున్నావు. నిక్కముగ నీకీమె గర్భము మృత్యు వేయైన నీమెను చంపి తగులబెట్టినను నీకు మారణకారణమైన యేశత్రుబీజమో మఱియొక రూపమును దాల్చి నిన్ను జంపగలదు. ఎట్టి బల్లిదుడైనను దైవమానకు మృత్యువునకును దాగియుండి తప్పించుకొనువాడు లేడు. మఱియును.

గీ. తొంటి ప్రారబ్ధకర్మంబు ౯ నంటి తిరిగి
జీవి కష్టసుఖంబుల ౯ జెంది చచ్చి
వేరొక యుపాధిజేరుగా ౯ మారుచుండు
తృణజలూకము కరణి పృ ౯ థ్వీస్థలమున.

కావున శాంతివహించి విజ్ఞానదృష్టినవలోకింపుము. చెల్లెలిని రక్షింపుము.

కంసు—ఏమీ! వసుదేవా!

ఉ. మృత్యువు మృత్యువంచు వచి ॥ యింపగ నైవబలంబు కల్గినన్
హత్యయొనర్ప లేరని య ॥ హంకృతితో నెదురేగ జొత్తురే
వ్యత్యయమేల పల్కెదవు ॥ వేయి వచింపగనేల నీసతిన్
సత్యముగా వధింతు నిము ॥ సంబున, నాకిక నడ్డురాకుమీ.

వసు—ఆ! ఆ! నీకు మంచిమాటచెప్పెద నాకర్ణింపుము.

ఉ. చంపకుమయ్య, దైవకృప ॥ సంతతికల్గిన వారి నీకు న
ర్పింపుమనయ్య, నామనవి ॥ వీనుల జేర్పగదయ్య, మూలము
ద్రెంపిన ఘోరపాప మరు ॥ దెంచుగదయ్య, దయారసంబు బూ
రింపగదయ్య, మాయెడ స్మ ॥ రింపగదయ్య స్వబంధుభావమున్.

దేవకి—అన్నా! నీకంతచల మెందులకోయి. ఇదే నావాగ్దానము నాల
కింపుము.

ఉ. చెల్లెలిపై దయారసము ॥ చిల్కగదన్న, ప్రసూతలైన నా
పిల్లల నీపదాబ్జముల ॥ బెట్టుదునన్న, ధరిత్రినీవె నా
తల్లియు దండ్రివన్న, హిమ ॥ ధామ దివాకరసాక్షికాగ నే
కల్లలు బల్కనన్న, మృష ॥ కాదిది నమ్ముమునమ్ము మగ్రజా.

ఇందువలన నీ కిహాపరంబులు రెండునుగలవు కావున నన్ను గాపాడుము.

కంసు—ఏమీ! ఆలాగున బుట్టిన పిల్లలనెల్ల నాకు సమర్పింతురుకదా.

దేవకి—అన్నయ్యా! తప్పక సమర్పించెదను.

దేవకుడు—నాయనా! నిశ్చయముగ నీపరమచేయునోయి. పిల్లలనీ వెట్టు
చంపినను ముందు నాగర్భమునకు జిచ్చుపెట్టక కరుణించినందు
లకు సంతోసించుచున్నాను.

కంసు—ఓ దేవకీవసుదేవులార! ఇప్పటికి దప్పెగదా యని తలంపకుడు
నా నిశ్చితాభిప్రాయమును వినుడు. వసుదేవ!

చ. త్రికరణశుద్ధిగాగను సు ॥ ధీమతివై జనియించినట్టి య
ర్భకుల నొసంగువారమని ॥ భాస్కరుసాక్షిగ బల్కితేని మీ
రిక చెరసాల స్వేచ్ఛ విహ ॥ రించుచు సర్వసుఖాల బొంది డిం
భకులు జనించినంతటనె ॥ వారిని నాకు నొసంగుచుండుడీ.

అంతియేకాని మిమ్ములను మీపురమునకు బోనిచ్చువాడను కాను మీదంపతులు మాచెరసాలలోనే కాపురముండవలయును రండు.

దేవకి—(తనలో) దైవగతి యిట్లుండ మావ్రాత దప్పించువారెవ్వరు.

(అందరు నిష్క్రమింతురు.)






ద్వితీయాంకము.

రంగము:—మధురాపురవీధి.

[నారదుఁడు ప్రవేశించును.]

నారదుఁడు—అక్కటా! ఇది దేవరహస్యము కంసునితోఁ జెప్పుదునా! మానుదునా! అజీర్ణరోగికి పెసరపప్పు తగులగనే కడుపుబ్బినట్లు రహస్యమును వెల్లడించి తంత్రము పన్నువరకు నాకడుపు భేరీవలె డమడమ మ్రోగుచుండును. ఇంతకును మధురాపురము ప్రవేశించి కంసుని కీయంశమును దెలియఁజేయక నే నీబాధ పడనేల? కావున నీ దేవరహస్యమును కంసున కెఱింగించెదనుగాక. అల్లదే కంసునియాస్థానము. పోయెదనుగాక.

(నిష్క్రమించును.)

ఇది శుద్ధవిష్కంభము.

రంగము:—కంసుని సభాభవనము.

[కంసుఁడు శంఖుఁడు ప్రవేశింతురు.]

కంసుఁడు—తమ్ముఁడా! శంఖుఁడ! దేవకీవసుదేవులు సత్యమును దప్పనివారేసుమి! ఏమందువేని.

చ. కొడుకుల నార్వురన్ విడువ । కూడదటంచు దలంపకుండ నా
యెడగలభక్తిచే నొసఁగె । నెంతయు జంపుమటంచు నేన పే
ర్మిడి తలపోయుచున్ విడచి । పుచ్చితి నావసుదేవుయోగ్యతన్
బుడమి పవిత్రమయ్యెగద! । భూరిగుణోత్తరుడౌట దమ్ముడా.

శంఖు—అన్నయ్యా! మీ చెల్లెలి యష్టమగర్భము కదా! నీకు మరణ హేతువని యశరీరి చెప్పినది! కావున వీరిని విడచినను నీకెట్టి యాపదయు బొదలదు. ఏడవ బాలునిగూడ విడువవలసినదే యొకమిడదవమాయదయించిన శిసువును జంపినజాలుననితోచెడిని.

సేవకు—(ప్రవేశించి) స్వామి! కంసమహారాజ! ద్వారముచెంత నొక నిరాచారి మీదర్శనమునకై వేచియున్నవాడు.

కంసు—ఓరీ! తక్షణ మా మహాత్ముని ప్రవేశపెట్టుము.

సేవకు—చిత్తము. (నిష్క్రమించును.)

నారదుడు—(ప్రవేశించి) ఉగ్రసేనకుమార నీ క శుభంబగు గాక.

కంసు—ఓహో! నారదమునీంద్ర! నా యభివందనముతో నీ రత్న పీఠము నలంకరింపుము.

నారదు—మంచిది.

కంసు—బ్రహ్మమానసపుత్ర!

శా. ఏయేలోకములన్ జరించుచును మీ రేదేశముల్ చూచి వా
లాయంబిచ్చటి కేగుదెంచితిరి ప్ర హ్లాదంబుగా భక్తినే
జేయంబూను సపర్యజేకొని ఋషి శ్రేష్ఠా! కృపంజూడవే
శ్రేయంబౌకద! మాదృశావళికి మీ సిద్ధాగమాదిక్రియల్.

నారదు—మధురారాజ్యవల్లభ! కంసమహీపాల!

కం. మావంటి మునుల కెప్పుడు
మీవంటి నృపాళిసేమ మేకద! కోర్కుల్
భూవర! హితము వచింపం
గావచ్చితి నింతకన్న గలదే మాకున్.

కంసు—ఓహో మహాత్మా! కృతార్థుడనైతినిగదా అటులైన.

ఉ. చెల్లెలి నొక్కనాను పతి కై నీవుకు శేర్చుకు వేళఁ గంస ! ని
న్నల్లన దేవకీభగిని కై యష్టమగర్భము చాపుసంచునా
యల్లను ఝల్లనంగ గగ నోక్తి వినంబడె నాటనుండి నే
తల్లడ మందుచుంటిని వెతల్ హరియించెడుయోజ జెప్పవూ.

నార—ఓయీ ! ఆ యశరీరవాణి పల్కులు సత్యములు. నే నొక దేవరహస్యమును జెప్పెద వినుము. నీవు నీసహోదరులు రాక్షసాంశ చేత జనించినవారని. ఖు మిమ్ముల సంహరించుటకై నారాయణుండు దేవకీదేవి గర్భమున నుదయించుననియు నందాది యాదవవంశజు లందరు దేవాంశభవులనియు వినియున్నాను. హితుడవగుటచే నీకీవార్త జెప్పువరకును దోచకుండుటచే నీ కెఱింగింపవచ్చితిని కావున దీనికేది యుపాయమో నీవే యోజించికొనుము.

కంసు—ఓహో మహానీందా ! ఏమీ అది నిశ్చయమేనా ! నాకొఱకై శౌరి దేవకీగర్భమం దుదయించుమాట సత్యమేనా ! మంచిది అగుగాక కాని.

గీ. పసులమేపికొనుచు కై మిసిమిగడ లమ్ము
కొనుచుదిరుగు వెర్రి కై గొల్లలెట్లు
దివ్యులైరి యెఱుగ కై చెల్పగదయ్య యో
దేవమౌనివర్య ! కై ధీవిశాల.

నార—నేను ముఖ్యమైన అంశమును జెప్పితి. ఇంతకుమించి నీవడుగ రాదు, నేను చెప్పరాదు.

కంసు—అక్కటా ! వెర్రిపని చేసితినికదా ! స్వామీ !

చ. తెలియక ప్రేమనెంచి యల కై దేవకిపుత్త్రుల నార్వురన్ వధా
ర్హుల దునుమాడకుండుట వి కై రోధుల బెంచుటగాక. శ్రీయమే
చలమునవారి నీక్షణమ కై చంపవలెన్, మది శాంతిగావలెన్
ములుచ విధానశాత్రవుల కై ముద్దుగబెంచితి, ఖ్యాతిపోయితిన్.

నారద—సందియమేల! ఇకనైన నాత్మరక్షణమునకై ప్రయత్నింప వలె. నే నింతకుమించి సంయమీంద్రుడ నగుటచే జెప్పుట మంచిదికాదు. నేనిక బోయెదను.

కంసు—మహాత్మా! అనుగ్రహించి నా శ్రేయస్సు గోరుచుండుటకు బ్రార్థించుచున్నాను.

నార—మంచిది. (నిష్క్రమించును.)

శంఖు—అన్నయ్యా! ఇకనైన నాలసింపక శాత్రవసంతతి నురుమాడి ప్రశాంతచిత్తుడవు కమ్ము.

కంసు—తమ్ముడా! ఇంకను ఆలసింతునా.

గీ. కంసుడనియెడు ప్రళయభాస్కరుడను, నేను
మొదలు నందాదియాదవ ముఖ్యులైన
నవతరిత దేవతల నెల్ల నడలగాల్చు
దౌలుత దేవకీసుతులను బిలుకుమార్చు.

తమ్ముడారమ్ము. (ఇద్దరు నిష్క్రమించెదరు.)

2 రంగము:— గగనవీధి.

[యోగమాయయను స్త్రీ ప్రవేశించును.]

యోగ—ఆహాహా! భవరోగము పరాత్పరునకైన దప్పదుకదా! భగవంతుండైన నారాయణుండు దుష్టులైన కంసాదుల సంహరించుటకై దేవకీదేవి గర్భంబున నుదయించునట. నన్ను దేవకీదేవి గర్భంబున శేషాఖ్యచే బెఱుగుచున్న తన యంశమైన పిండమును రోహిణీదేవి గర్భంబున బెట్టుమనియు నన్ను యశోద కడుపున జన్మింపుమనియు నా కానతిచ్చెను. కావున యోగమాయనైన నేను నారాయణుండు చెప్పినట్లు చేసెదనుగాక.

(నిష్క్రమించును.)



# సంగీతకృష్ణలీల.



తృతీయాంకము.



రంగము:—చెరసాల.

[దేవకీవసుదేవులును దీర్ఘనేత్రుడు రక్తాక్షియు బ్రవేశించెదరు.]

దీర్ఘనే—అక్కటా! దాస్యము కడు దుర్భరమైనదికదా! ఆలుబిడ్డల విడచి రాత్రియనక పవలనక సేవ చేయవలయును. ఈదేవకి యెప్పుడు ప్రసవించునో అప్పుడు తనకు దెల్పుమని మాకంస మహారాజుగా రాజ్ఞ యిచ్చినారు. అందునే నీమెను కనిపెట్టుకొని యున్నవాడను. అదేమి మాయయోకాని దేవకీదేవి సప్తమగర్భపిండము కడుపులోనే హరించిపోయినది. ఇప్పుడు కంస భంజనకారణమైన యెనిమిదవకాన్పు సిద్ధమైనది. ఇప్పుడే నేను బహు భద్రముగ బరీక్షించుచుండవలెనట. నా దీర్ఘనేత్రనామము నాకొంపముంచినది. నాకు దృష్టివైభవ మెక్కువకలదని నన్నీ యుద్యోగమునకు నియమించినాడు. మాకంసుడు వెఱ్ఱివెధవకాకపోతే నిజముగ మృత్యువునకు డాగువాడున్నవాడా! ఇంతకు వాని ప్రారబ్ధమెట్లున్న నేమి? నాకునిద్దురవచ్చుచున్నది. తరువాత యెట్లు జరిగినను కనిపెట్టి చెప్పునది రక్తాక్షి కలదుకదా! కావున నేను హాయిగనిద్రపోయెదను. (నిద్రించును)

రక్షకు— నాప్రారబ్ధము కాకపోతే పుఁడువంటి యీ వర్షకాలములో హాయిగా మగనిని కౌఁగలించుకొని మెత్తని దూదిపరుపు మీఁద సుఖనిద్రపోవక నాకీదాస్యవృత్తి యేల రావలయును. రేయుంబవళులు గ్రుడ్లుతీసికొని యీ దేవకి యెప్పుడు ప్రసవించునోయని కనిపెట్టుకొని యుండవలసివచ్చెను కదా! దైవమా! ఎప్పుడో దేవకి వ్రేలుకనిపెడంత పిల్లవానిని గని తన్ను జంపునని మాకంస మహీపాలుండు మాప్రాణముల దీయుచున్నాఁడు. వీడెన్ని కట్టుదిట్టములు చేసినను నిజముగ దన్ను జంపెడువాఁడే పుట్టియెడల దాను తప్పించుకొనగలఁడా? వాని ప్రారబ్ధము వానిది. నాకు నిద్ర వచ్చుచున్నది. హాయిగ నిద్రపోయెదనుగాక. (నిద్రించును.)

దేవకి— ఈ రక్షకభటులు క్రమముగ నిద్రావస్థలో మునిగినారు. అక్కటా స్వేచ్ఛగవిహరింప కెట్టియిక్కట్టుల నలయుచుంటిమి!

గీ. భటుల వీక్షించునతరి కంస — భయము తోఁచు
దృష్టినుగలింప మదినిసం — తుష్టి తోఁచు
నొక్కత్రుటిలో విచారము — నొక్కగడియ
నిర్విచారము మదిలోన — నెగడెనకట.

అన్నన్నా! యెంతటి దురదృష్టవతిని దైవమా.!!

ఉ. బిడ్డలనాఱ్వురన్ గలుష — భీతిదలంపక బంధులెందరో
యడ్డమువచ్చి వద్దనిన — నాగక కంసుఁడుక్రూరబుద్ధి మై
జడ్డనఁజంపె దైవవిధి — సప్తమగర్భము తాహరించె నీ
యొడ్డున దాటుటెట్లొ! మది — కూరటగల్గుటయెట్లొ దైవమా.

అన్నన్నా! ఈగాఢాంధకార కారాగారమున నీఘోరరాక్షస పరివారముమధ్య నేను ప్రసవించుటెట్లు. నాగర్భశుక్తి ముక్తాఫలంబును గనులార గాంచుటెట్లు.

వసుదే— దేవీ! దేవకీ! విచారింపకుము. మనకు సర్వేశ్వరుఁడే రక్షకుండు మన యాపద లావలకుఁద్రోసి రక్షింపఁగలఁడు. నేను పలికినట్లు తొలుతఁబుట్టిన యార్వుర బాలుర నొసఁగితినిఁకదా. కంసుఁడును నాసత్యమునకు మెచ్చి యాబాలుర విడచినాఁడు కాని తరువాత నారదుండు వచ్చి యేదో బోధింప వాఁడుతిరిగి మన బిడ్డల సంహరించినాఁడు. మనమేమో దేవాంశజులమఁట! అగుగాక. అట్టిదైన మనకీపాట్లచిరకాలముననే తప్పును. కావున దుఃఖమున కెడమీయకుము. ధైర్య మవలంబింపుము.

దేవకి— నాధా! ధైర్య మెట్టులలవడును.

చ. నిజముఁగ దేవతాంశల జనించితిమేని దురాత్ముఁడైన య
గ్రజుఁడిటు బందిలోననిడి కష్టముఁబెట్టునె! యక్కటక్కటా
అజుఁడిటు వ్రాసెనంచు మది నెయ్యమున గుందకయుండుటెట్లొకో! సా
ధుజనుల నేర్చు పాతకము ద్రుంపకయుండునె దుష్టకంసునిన్.

కావున మనము దేవతాంశజుల మనుటయు కంసుఁడు రక్కసుఁడనుటయు గల్లయే. ఇంతకును మన కిట్టిదుర్గతి ననుభవింపవలసివచ్చినది కదా!

వసుదే— సాధ్వీ! దేవకీ! గౌరవముగలవారికే యధోగతులు ప్రాప్తిల్లును. లఘుప్రాయము లున్నతాసన మలంకరింతురు. ఏమందువేని.

గీ. విలువకలిగిన ఘనరత్న వితతి నెల్ల
క్రిందుభాగమునను దాల్చుఁ గేవలమును
నల్పమగు తృణమును శిరమందు దాల్చు
నబ్ధినాయకుఁడది కానవా! సుశీలా.

కావున ప్రస్తుతము కష్టము ననుభవించినను తుదకు మనమే సుఖమనుభవింపఁగలము.

దేవకి—జీవితేశ్వర !

గీ. ఎప్పుడో సుఖమగునని ◆ యె చుకొట్టు
గర్భముల గట్టు ... భారమాయె
నేమి సేయుదు విధి గతి ◆ హీనులకును
శిరములనువంచి నతులను ◆ సేయవలసె.

వసుదే—అబలా ! నీవందులకై విచారింపకుము. పరులకు నమ్రులమై యుండుట మనకలంకారము సుమి, యేమందువా ?

గీ. పుష్పఫలచయ భరితమౌ ◆ భూజమునకె
నమ్రభావముగాని య ◆ నామకముల
మోడుచెట్లకు వినయంపు ◆ మద్దు కలదె
కాన నమ్రతమన కలం ◆ కారముసుమి.

కావున మనకీకష్టదశ అధికసుఖమునకు కారణమగును. అచిరకాలముననే మనకీ కారాగారబాధ తొలగును.

[బ్రహ్మ యింద్రుడు ప్రవేశించెదరు.]

బ్రహ్మ—శతమఖా ! చూచితివికదా ! ఈమహాదేవిని దేవకిని.

గీ. అగ్నిగర్భమైన ◆ నల శమీ వృక్షంబు
కరణిఁ జంద్రుకళ ◆ కంధిపోల్కి
గర్భ విష్ణుతేజ ◆ కోమలి దేవకి
గాంచినావె ! సురల ◆ కలిమిపంట.

ఇంద్రు—మహానుభావ ! పద్మసంభవ

గీ. దీపకళికలోన ◆ దీపింప వెలుగొందు
కాచపాత్రి కరణి ◆ గన్నుగవకు
దోచు నీమెకంజ ◆ లోచనుగనుటకు
నబ్బురంబె దేవ ◆ తార్తి తొలగ.

బ్రహ్మ—హే దేవకీగర్భస్థ నారాయణ! పురాణపురుష!

సీ. పంచభూతంబులై యెవ్వని మూలమునబుట్టు
నవను భూతములలో నిమిడియుండు
సత్య స్వరూపమై నిత్యమై శాంతమై
నిర్గుణంబై యేది నెగడుచుండు
నెయ్యది సమదర్శనేచ్చారతినిమించు
దేనికి నొందును హానిలేదు
భవ లతాబంధమే ప్రజ్ఞాన రూపుని
స్మరణచే దునియమై సమయుచుండు
గీ. నట్టిజగముల కాధార మైనవిష్ణు
తత్వమును సంస్మరింతు నిశాంతభక్తి
నమరు లెల్లరు నీదర్శనాభిరతిని
గోరుచున్నారు పొడమవే సారసాక్ష.

ఇంద్రి—స్వామి! ఆదినారాయణ?

ఉ. ఎన్నమజన్మముల మొక యీతయు నేరనినీవు దుష్టుల
త్యున్నతిమించ దద్భరము నోర్వకభూసతి నిన్నువేడ నా
పన్నులగాచు బుద్ధికల వాడవుకావున నుద్ధరింప నీ
యన్నులమిన్న దేవకి హ్రా దంతరమందున జేరితే హరీ
కిన్నఁబుట్టి దుష్టులను ఖండనజేసి ధరిత్రినేలవే.

బ్రహ్మ—గీ. జగములను నెల్లకుక్షిలో సరగనిల్పు
కొన్న పరమేశ్వరుండవు నిన్నుమోయ
నబల దేవకి యేపాటి దయ్య! శ్రీశ!
వెడలిరావయ్య దుష్టుల పొడవడంప.

శచీకళత్ర! పరమేశ్వరుని గనను్న యీమహాసాధ్వి సందర్శించి భావిశుభంబును జెప్పవలదా?

ఇంద్రి—స్వామీ! అదియు ముఖ్యకర్తవ్యమే కదా!

బ్రహ్మ—అమ్మా! దేవకీదేవి!

గీ. శ్రీరమేశుడు నీగర్భ సీమనుండి
వెడలనున్నాడు తల్లి! నీ వెతలుతప్పు
ఖేదమును బొందబోకుడి మోదమెుదవు
కంసముఖులను బరిమార్చు గలుగుసుఖము.

అమ్మా! నేనుబ్రహ్మను. ఈతండు మహేంద్రుండు. నీగర్భస్థుడైన లక్ష్మీకాంతుని ప్రార్థింప వచ్చినారము.

దేవకి—అమరులార! మీకీదాసురాలు సహస్రవందనముల సేయుచున్నది.

వసుదే—పూజ్యులైన పితామహేంద్రులకు నభివాదనము సేయుచున్నవాడ.

బ్రహ్మ—ఓపుణ్య దంపతులార! మీకు శుభంబు కలుగుగాక. నారాయణుండు మీకు బుత్రుడై యుద్భవించి కంసాదులనుద్రుంచి భూభారమడంచును. మీరిక చింతిల్లకుడు. బహుభద్రముగనుండుడు మీకు కళ్యాణంబులు సిద్ధించును. మేమిక పోయెదము.

వసుదే—మహాప్రసాదము.

దేవకి—నిర్జరులార! మీదర్శనంబున మాదుఃఖములు సమసినవి కరుణయుంచుడు.

[బ్రహ్మ యింద్రుడు నిష్క్రమించెదరు]

వసుదే—దేవీ! ఇక ధైర్యమవలంబించుము. మనకు దైవసహాయము కలిగినది.

దేవకి—నాథా! నాకేమో ప్రసవచిహ్నము లగుపడుచున్నవి.

వసుదే—సాధ్వీ! మెల్లన నీవాస్థలాంతరమునకు నడచిపొమ్ము. ఈరక్షకునిలేపి నీచెంతకు బంపుదునా!

దేవ—వలదు. కనినబిడ్డను కనులారజూడకుండ గంసునకు సమర్పించును.

(లోపలకు బోవును.)

వసుదే—అక్కటా! నాహృదయము తటతట గొట్టుకొనుచున్న దికదా!

చ. భవనమువంటునన్ బ్రసవ | బాధనుబొందుచు భార్యయేడ్వ నా
రవము గృహస్థుకర్ణము జొ | రన్ మదితల్లడ మందకుండునే
దవిలి విమర్శసేయ వసు | ధాస్థలి నెందరిగాంచినన్ బున
ర్భవమగుగాదె స్త్రీలకు ధృ | వంబుగ బుత్రులగాంచు పట్టునన్.

ఇంతకును సర్వేశ్వరుడేగతి. ఓ యిలవేల్పులారా!

గీ. కష్టమింతయులేక సు | ఖప్రసవము
నొంది నాభార్యశిశులాభ | మొందునట్లు
సేయరే వేల్పులార ప్ర | సిద్ధులార
భావికార్యానుగతులార | ప్రభువులార!

[తెరలో]

హేపరమేశ్వర! నారాయణ! శరణు! శరణు!

(విష్ణువు, దేవకి పిల్లవానితోడను ప్రవేశించెదరు.)

దేవకి—గీ. హేరమానాథ విశ్వేశ | సారసాక్ష
జగములను సృష్టిసేయ బో | షణముసేయు
లయమొనర్పగలట్టి కా | లస్వరూప
మునిజనావనశీల! వం | దనములివిగో.

వసుదేవు—హే! ఆదినారాయణ! పురాణపురుష!

చ. అవని స్వయంప్రకాశమయి | ఆగమబోధితమై సదాళిచే
స్తవములగాంచుచున్ శతవి | ధంబుల వెల్గుచు జంతుకోటి నా
త్మవిధమునన్ జరించుచు స్వ | మాయనులోకమునందునున్న మో
హా వివశులట్లు చేసెదు మ | హాత్తగు విష్ణువుతత్వ మెన్నదన్.

దేవకి—హే లక్ష్మీకళత్ర! పురాణపురుష!

ఉ. గాలిని నీరుగ్రోలుచు నఁ ఖండతపోరతులైన మౌను లే
వేళను నైన జూడగ లఁ భింపగ లేని త్వదీయదర్శన
శ్రీలభియించె నేవ్రతము ఁ జేసితినో తొలిబామునందు నా
పాలిటి రక్షకుండవు కృఁ పామయ! నిన్ను నుతన్ దలంచితిన్.

వసుదే—మహాత్మా! కమలామనోహర!

క. జగములకు మూలమగుచును
జగమగుచును జగములోని ఁ శాసకుడగుచున్
జగతికి వెలియై వెలిగెడు
జగతీశ్వర! నిన్నుగాంచి ఁ సఫలుడనైతిన్.

దేవకి—విశ్వమయ! శ్రీపతి!

గీ. కమలలోచన! నీవు నా ఁ గర్భమునను
జన్మ గాంచెదవనుచును ఁ జలజభవుడు
సెప్పె మాకష్టభరములు ఁ సెల్లెననుచు
గాన గంసుని బాధ వో ఁ కార్పుమయ్య.

విష్ణు—అవ్వా! నీవు విచారింపకుము. తొల్లి బృశ్నియను మహాపతి వ్రతవు. ఈవసుదేవుండును సుతపుండను ప్రజాపతి. మీరిరువురును పదివేల దివ్యవర్షంబులు నన్నుగూర్చి ఘోరతపంబు సేయ నేనుప్రత్యక్షమై వరంబువేడుమనిన నామాయకులోనై దుర్గమంబైన యపవర్గసుఖమునుగోరక సంతతిలేని విచారము నంజేసి నావంటి కొడుకునడిగితిరి. నేనటు లేవరంబిచ్చి అపుడు పృశ్నిగర్భుండను వాడనై పుట్టితిని. మలిబామున నదితికశ్యపులైన మీకు వామనుడనై జనించితి నిపుడీజన్మమున నర్భకుడనై పుట్టితి నింకమీయందు నెన్నటికిజన్మలేదు. ఇప్పుడొక విశేషంబు జెప్పెదను. వినుడు. వసుదేవా! నీవీబాలుని గొంపోయి వ్రేపల్లెలో నందుని భార్యయైన యశోదపక్కలో బరుండబెట్టి

యాంమెకడనున్న బాలికనుదెచ్చి దేవకిపక్క నుంచుము. ఈ విధానమంతయు నవిచ్ఛిన్నముగ నామహేతువలననే జరుగును. శేషుడుతన ఫణములతో నీబాలుని కంగరక్ష సేయుచు నీవెంటనేవచ్చును. కావున మీరికవిచారింపకుడు, మీకు భద్రంబులు చేకూరును. నేనికపోయెదను. (నిష్క్రమించును.)

వసుదే—ఆహా! దేవీ! భగవంతుని సందర్శనము మనకు నిజముగ నైనదా లేక స్వప్నమా!

దేవకి—ఆమహాపురుష సందర్శనము స్వప్నతుల్యముగనే యైనది. ఈబాలుని కనులారచూచి యానందించెదను (క్రిందనున్న బిడ్డ నెత్తికొని)

గీ. కమలములబోలు తళుకారు ఽ కనులవాఁడ
యింద్రనీలపు గాంతుల ఽ నీనువాడ
భ్రమరములబోలు ముంగురుల్ ఽ పరగువాడ
ముద్దులొలికించు చున్నవె ఽ మ్మొగమువాడ.

(బిడ్డను ముద్దు వెట్టుకొనును)

వసుదే—ప్రియురాల! బాలలీలలజూచుటకిది సమయము కాదుకదా! జగన్నాథుడు చెప్పినట్లీబాలుని గొంపోయి యశోదప్రక్కనుంచి యాబాలికను తేవలదా!

దేవకి—ప్రాణేశ్వర! కడుపారగాంచినబిడ్డ నొక్కగడియయైన ముద్దులాడక యెట్లీయగలను.

గీ. పుట్టెనో లేదో తమిదీర ఽ ముద్దులాడ
కెట్టు లీబిడ్డనొరులకై ఽ యిచ్చుదాన
ప్రాణము నొసంగుటకు సిద్ధ ఽ పడుదుగాని
విడచి యెట్లోర్తు పొత్తిళ్ళ ఽ బిడ్డనకటా!

వసు—ఓసీ! అజ్ఞానురాల! ఆలసించిన కంసభయము వెుుగనా!

దేవకి—నాథా! ఇదిగో నాగర్భశుక్తిముక్తాఫలంబు. తీసికొనిపొండు (బిడ్డను కన్నులకద్దికొని) వత్సా! నాకడుపుపంట!!

గీ. నిన్ను బెంచుచు నీచుంచు నిపుణమైన
భాగ్యమీదేవకికి లేదు పరులయింట
నాదుభార్య యశోద కానందమిడుచు
బ్రతుకుమోబిడ్డ నేను నిర్భాగ్యనగుట.

(బిడ్డనిచ్చివేయును. మూర్ఛపడిపోవును.)

వసుదే—(బాలునెత్తికొని) ఆహా నేనెంత నిర్భాగ్యుడను.

సీ. ఈపుత్రుడేకదా మదీయవంశాబ్ధికి
పూర్ణశశాంకుడై పరగువాడు
ఈవిసీలాకారుడేకదా! దుష్టులౌ
కంసాదులనుజంప గాలయముడు
యీకళావదనాబ్జుడేకదా! దేవకీ
వసుదేవులకుస్వీయ పాణధనము
యీసువేకదా! మహీభారముడుపంగ
విష్ణుతత్వంబున వెలసినాడు

గీ. అట్టిగారాబునాపట్టి కంసరక్ష
మైనసేసెడునట్టి భాగ్యంబులేక
పగులపాల్సేయుచుంటిని కరుణదొఱగి
నన్నుబోలిన నిర్భాగ్యుడున్నవాడె.

ఓహో! నేను పుత్రవ్యామోహామునంజేసి జగతీశ్వరునాజ్ఞ నేమరుచున్నాను. కావున వేపవల్లెకిపుడే పోవెదనుగాక. (చూచి) ఆహా! ఆశ్చర్యముకదా! సర్వేశ్వరుకృపవలన గవాటబీగము లూడినవి (వెనుకకు

చూచి) ఓహో ! శేషుండు తన ఫణములవిప్పి బాలున కెట్లుగరక్ష
సేయుచున్నవాఁడో! నేనిక త్వరితముగ బోయెదనుగాక. (నిష్క్రమించును)

దేవకి—(లేచి) అక్కటా ! కమలామనోహర! నీవుగర్భమున బుట్టుట
స్వప్నమువంటిదయ్యెనుకదా !

ఉ. పుట్టినవాఁడ వొక్క క్షణ । మున్ గరయుగ్మమునందునుండ కి
ట్టునసే యశోద యొడి । పట్టున జేరగబోతివయ్య యో
పట్టి! యికేమనందగును । స్వప్నపువార్తలు నిన్ను గాంచుటల్
యెట్టివ్రతంబునందు సతి । యేర్పడజేసెను ! నిన్ను బెంపగా.

ఏమిసేయుదు. నేనింతవఱకే నోచికొంటిని.

గీ. అల్పవ్రతములు జేసి మ । హత్తరంపు
ఫలము బొందగవలెనన్న । గలుగునెట్లు
యెప్పుడెవ్వారి పాత్రిళ్ళ । నొప్పునిసుప్రు
బాపితినొ ! యిప్పుడీగతి । ప్రాప్తమయ్యె.

సరే నాప్రాణేశ్వరుండు నాబాలు నచ్చటనుంచి యాయశోదచెంత
నున్న బాలికను తెచ్చునుగదా ! ఆపసికూనతో బొద్దుపుచ్చికొనెదను
గాక. అక్కటా ! ఏమి నావెర్రి ! నాయష్టమ గర్భము కంసుని హరించు
ననికదా యశరీరి పలికినది. ఆదుష్టు డీబాలికను మాత్రము చంపక
విడచునా !

వసుదే—(బాలికతో బ్రవేశించి) ప్రాణేశ్వరీ ! ఈయాఁడుపిల్లను నీయొ
డిలో నుంచికొని మనవల్లనయ్యె కుమారుగ జూచికొనుము
(పిల్లనిచ్చును)

దేవకి—నాథా ! మహాప్రసాదము.

[తెరపడును]



2 వ రంగము. సభాభవనము.

[కంసుడు శంఖుడు ప్రవేశించెదరు]

కంసుడు—సహోదరా! దేవకి యష్టమగర్భము నాకు మరణకారణమని చెప్పినదిమొదలు నామనస్సునకు స్వస్థతలేదుకదా!

ఉ. నారదుడట్లుచెప్పిన ది । నంబు మొదల్ వసుదేవముఖ్యులా
భీరకుమారులెల్ల బృధి । వీస్థలి నట్టిక్రియల్ పొనర్తునో
శౌరిస్వకీయ మాయయను । జాలముపన్ని నుతేమిసేయునో
దారుణవృత్తినంచు మది । తల్లడమందెదు సుమ్మితమ్ముడా.

శంఖుడు—అన్నయ్యా! ఆవసుదేవాదులేమవు. అమరేంద్రాదులైన నీసిగపూవును ద్రుంపజాలరు. కాని దేవకి యష్టమగర్భమనుటచే శౌరి యామెకు బుత్రుడై పుట్టునేమోయని సంకోచము కలుగుచున్నది.

కంసు—తమ్ముడా! దేవకిబిడ్డడైనను ఆశౌరి నాచే జిక్కినాశని తలంచెదను. ఏమందువా!

సీ. మత్స్యరూపమున సో । మకుద్రుంచినట్టుల
గోత్రడమై కనకాక్షు । గూల్చినటుల
మోహినియై బలి । ముఖదానవశ్రేణి
వంచించి సిరుల హ । రించినటుల
నరసింహుడై హిర । ణ్యకశిపున్బ్బలియించి
వామనాకృతిబలి । బట్టినటుల
భార్గవుండై రాజ । వర్గమేర్చినయట్లు
శ్రీరాముడై దశ । శీర్షుజంపి

గీ. నటుల నన్నేమిసేయునో । యనుచునాత్మ
దలకెదనుగాని దేవకీ । తనయుడైన

బల్మిచేనైన జేకొని ౯ వధమొనర్చి
స్వస్థచిత్తునసాచు బ్రి ౯ శాంతిగందు.

శంఖు—అన్నయ్యా! దేవకి మన బందెలోనిదే కదాయని యాలోచిం చుచున్నావు. ఈ దుష్టసుగర్భస్థ పిండము నీచేతికి జిక్కినప్పుడు కదా నీకద్దానిని వధించి సుఖపడుట.

కంసు—అగునురా తమ్ముడా! కాని నాహృదయకోశము కంపించు చున్నది. యెందుజూచిన నామనోదృష్టికి శ్రీహరియే కనిపించు చున్నవాడు నాకన్నులకు విష్ణురూపమువినా అన్యమేకనుపడుట లేదు. అయుగో శ్రీహరి! అల్లదే కేశవుడు! ఓసీ మాయానాటక సూత్రధారీ! ఎందుబోయెదవురా! నాచేత జచ్చితివిలే (లేచి) (ఖడ్గము నెత్తికొని పరుగెత్తుచు)

సీ. చితచిన్నగుచునోప్పు ౯ చేలముధరియించి
నావె! శ్రీహరినిన్ను ౯ నరకివైతు

శంఖు—(కంసుని చేయిపట్టుకొని) అన్నయ్యా! ఇదేమి వెఱ్ఱి. పలురంగు లుగల మణిస్తంభమునుజూచి హరియని భ్రమబడుచున్నావు సుమీ!

కంసు—ఏమీ! ఇది మణిస్తంభమా! (అలకించి)
కామురా! తమ్ముడా ౯ కంజాతుకంఠర
వంబిదేవిడుము శి ౯ రంబుదెగింతు.

(ముందునకుబోవ నుంకించును)

శంఖు—అయ్యో! అన్నయ్యా! నీకు బిచ్చియెత్తినదా! ఏమి అయ్యావి మధ్యాహ్నకాలముచు దెల్పు మాగధుల కంఠధ్వనులుకాని మాధవుని పలుకులుకావు. ఏలభ్రాంతి జెందెదవు?

కంసు— వారింతువేమిరా ౯ వారిజాతుడుఖడ్గ
ధారియై యుద్ధెనన్ను ౯ దారసిలెడు

శంఖు—అన్నా! వాడుమన ప్రతీహారికాని శౌరికాడు స్వస్థచిత్తుడవు కమ్ము.

కంసు—(దిశ లవలోకించి)

హరికంఠమునబుష్ప ౯ హారగంధముకదా
యీయపూర్వపుదావి ౯ యెంచిచూడ

శంఖు—అయ్యా! ఈయపూర్వ పరిమళము మహిళాజనములు కచభారములకు వేసికొను ధూపవాసనలుకాని దివ్యకుసుమ సుగంధములు కావు. నీమనస్సు పూర్తిగ జెడిపోయి హరినే తలంచుటచే నిట్లుభ్రమపడుచున్నావు కావున స్వస్థచిత్తుడవుకమ్ము (కంసుని భుజమున జేయివైచును)

కంసు—గీ. కటకటా కేశవునికరా ౯ ఘాతమిదిగో

(ఘాతమునభినయించు)

శంఖు—అన్నా! నేనే నీభయమును వాపుటకు నీభుజమున జేయివైచితిని. కేశవుడును లేడు గీశవుడును లేడు.

కంసు— వాడుహరికాడె యన్యతంబు ౯ లాండ్రెదేల

(యెదుటజూపును)

శంఖు—అక్కటా! నీచిత్తవైకల్యమేకానియిందెవ్వరును లేరుచూడుమా!

కంసు— నాకుగన్పడి నీకు గ ౯ న్పడదెదేమి

శంఖు—అన్నా! నీమనంబెల్ల హరిమయమగుటచే నట్లగుపడుచుండెగాని మనముతప్ప యిందెవ్వరును లేరు. ఇదంతయు నీమతిభ్రమణమే.

కంసు— వనజనేత్రుడె కన్నుమూ ౯ సినను తోచు.

శంఖు—ఇకనేమి! నిస్సందేహముగ నీమతిచాంచల్యమే నిన్నిట్లు చేసినది.

దీర్ఘనేత్రుడు—[ప్రవేశించి] దేవా! కంసమహారాజ! దేవకి ప్రసవించినదని తెలుపవచ్చినాను.

కంసు—ఏమీ! ప్రసవించెనా! స్త్రీయా! పురుషుడా!

దీర్ఘ—(తనలో) అక్కటా! అంతమాత్రపు వివక్షత తెలిసికొనక వచ్చితినే (ప్రకాశము) స్వామీ పిల్లయార్పు వినుటతోడనే పరువిడివచ్చితిని. ఆకుంశము గనుగొనిరాలేదు.

కంసు—ఓరీ! ఆబిడ్డతో దేవకి నిటకు దోడ్కొనిరమ్ము పొమ్ము.

దీర్ఘ—చిత్తము (నిష్క్రమించి దేవకీవసుదేవులతో బ్రవేశించును)

కంసు—(ఖడ్గధారియై)

గీ. ఓసిదేవకి! నీగర్భ వాసుడైన
బాలకుఁగంటివే నాదు ప్రాణములను
దీయనున్నట్టి నిసువుని ? దెచ్చియిమ్ము
వానిబట్టిమార్చి వాపగ వాపికొందు.

(బాలికను లాగబోవును)

దేవకి—కం. అన్నా! మగపిల్లడుకా
డన్నా! యిదియాడుపిల్ల యాలింపవెనా
విన్నపము, కోడలౌనుగ
దన్నా! నినుజంపదలచు నరికాదన్నా!

కంసు—ఓసీ! దేవకీ.

ఉ. ఆమదియైన నీకడుపు నందునఁ ష్టమగర్భవాసమై
పోడిమిలేక పుట్టిన క పోతకిశోరముసైన జంపను
న్నాడనుసుమ్ము నాదుమర ణంబున కాస్పదమైనదాని నే
వీడుమనే! తొలంగి పసి పిల్లనొసంగుము వేగదేవకీ.

దేవకి—అన్నా! అన్నా! ఒక్కమాటవినుము.

మ. శిశుహంతల్ కడుబాతకంబనిబుధ శ్రేష్ఠుల్ మొరల్ పెట్టరే
దిశలన్నిండిన కీర్తికాముడవునీ తేజంబుచల్లారదే!

యశ్శమా! నీకుబ్రీతిమ్మదయా! సుగుణమా ఆర్తావనస్వాంబ! బా
లిశవృత్తిఁ బ్రోడనాడుమన్న!! దయ బాలింపంగదే! ధీమణీ.

కంసు—ఏమీ! అలాగైన నిదిగో జెప్పెదను వినుము.

చ. కలుషము జుట్టుకొన్నను, జగంబులు నన్ను నిరాకరించినన్,
దులువయటంచు బాధులు హితుల్విడనాడినగాని, తల్లిదం
డ్రులు కులనాపకుండని కఠోరముగా వచియించి వీడినన్
దొలగక నీదుపిల్లతల దుంపకమానను ఖడ్గధారచే.

వసుదే—బావ! యీపసికూన నీకపకారము సేయునది కాదు. నీవింత యూరడికోర్వ బాడికాదు. కాపున రక్షించి విడువుము.

దేవకి—అన్నయ్యా! మరియొకమాటవినుము.

ఆ. వె. కొడుకు నీకు శత్రుఁడని వింటివి కదా!
ఆడుపిల్ల పుట్టె నందువలన
మింటిపల్కు లిట్లు మిథ్యయైపోవంగ
దానిదున్మ నీకుఁ దగునె యన్న.

కంసు—ఓసీ దేవకి!

ఉ. వేయువచించినన్ జోరవు పీనుల నాకికఁ జెప్పనేల! నా
శ్రేయముఁ గోరితేని ప్రతిఁ జెప్పక పిల్లనొసంగు లేకనా
యాయువు దీయనెంచిన సమర్పణ సేయునటంచుఁ జెప్పు మీ
యీయెడ నీసుపుత్రివధ యీపకమానను భూమిసాక్షిగా.

(పిల్లనునరుకఁబోవును)

దేవకి—హా! అన్నా! రక్షింపుము (యొడిలోదాచికొని)

ఉ. చంపకుమన్న, యీశిశువు శత్రువుగా గణియింపకన్న, ప్రా
ర్థింపుచునుంటి నార్గురవ ధింపచె! బిడ్డలఁబ్రేమచేత శాం
తింపగదన్న, దారుణగతిన్ దలపెట్టకుమన్న, మమ్ము బా
లింపగదన్న, పుణ్యము ఫలించుగదన్న, నమస్కరించెదన్.

కంసు—దేవకీ! మూర్ఖురాల! సోదరివయ్యును యీకసుగాయనిమిత్తమై
నావంటిభ్రాతను మృత్యువు పాలుసేయ దలంచితివిగా!

చ. విడువుము బాలికన్ విడువ వేని నినున్ బొలియింతు నిప్పుడే
జడమతివైతివుసుల్ గొనగ జాలినబాలిక జాపకుంచునే
పడతి! తొలంగు మావలకు ప్రాణమునీవును బాయనేలనా

(పిల్లనులాగికొనగా దేవకి పాదములబడును)

యడుగులనుండి లేచిచను మా అనపత్యనటంచు నెంచుమా.

దేవకి—(పాదములవిడువక) అన్నా! యీపసికూనజంపుట బాడి
కాదు. రక్షించుము నీకిదికోడలు.

కంసు—ఛీ! భ్రాతృహంతకీ! ఆవలకు దొలగుము (త్రోసివైచును)

దేవకి—హా! (చేతులుసాచి) నాచిన్నిబిడ్డా! నాగర్భరత్నకళిక!
నాముద్దులతల్లీ నన్నువిడచిపోతివా! యీకులపాంసకు నీశి
శుహింసకు నీకసునిచే బడితివా! అయ్యో!! మరల నాకంట
బడుదువా! హా నాకన్నుల బడుదువా! హా! హా!

కంసు—(బాలిక పాదములగొని యెగరవైచి నరుకబోవ యెగిరి
పోవును.)

(ఆకసమునుండి)

చ. కరుణయొకింతలేక కసుగాయల దేవకిదేవిబిడ్డలా
ర్వురను వధించినావు, నను భూమివిదిర్చితి వీవుత్రుంప, నా
సరసనుబుట్టి యొక్కపురుష ప్రవరుండు బెరుంగుచుండె నీ
గరువమడంచి చంపును జగంబులు హర్షముబొంద గంసుడా.

అందరు—(ఆశ్చర్యముతో మింటివైపుజూతురు)

కంసు—ఆహా! ఇదేమియాశ్చర్యము! అక్కటా! వ్యర్థమనోరథుడనైతిని
కదా! ఇకనేమిదిక్కు దైవమా! సరే!యిక గర్వముపనికిరాదు.
బావ! వసుదేవ! అమ్మా దేవకీ!!

గీ. బాలఘాతమొనర్చితి ♦ బాపులంగు
జేరితిని నన్ను మన్నన ♦ జేయుచలయు
గగన భాషణముచేత ♦ గలకఁజెంది
యిట్లు చేసితినచు దయ ♦ నేలుము నన్ను.

దేవకి—ఓరీ శిశుహంతకా! నీకీసుబుద్ధి యిపుడుకదా పుట్టినది!

గీ. వలను వలదన్నమాసక ♦ కలుషమతివి
నాకసుపునకు జిచ్చిడి ♦ నాప్రునిప్ర
యింతనే సమయునే పాప ♦ మెల్ల ఖలుడ
నిన్ను సమయించు ద్వరలోన ♦ నిశ్చయంబు.

కంసు—సోదరీ! అన్నిటికని నేను సమ్మతించియేయుంట నన్నిట్లు పరుషోక్తులాడ నేల. బావ! వసుదేవ!

గీ॥ మూఢమతినయి మీవాక్య ♦ ములపు వినక
నీదుబిడ్డల జంపితి ♦ నెనరు లేక
యొకరి మరణంబునకును నిం ♦ కొకరు కారణంబనుట వెఱ్ఱిమాట జ్ఞా ♦ నంబు వచ్చె.

వసు—కంసా! నీకిపుడీ ప్రశాంతవాక్యములక్కరలేదు బనియేల

గీ. బిడ్డలనుజంపి యిప్పుడీ ♦ ప్రియము లేల
పల్కుచున్నావు నిన్నన ♦ పని యదేల
మాపురాకృత మిట్లుండె ♦ మధురనాథ
దైవనిర్ణయ మిట్లుండ ♦ దాట వరమె.

కంసు—శాంతవచనంబుల జెప్పినను మీరున న్నుపాలంభించుచునే యున్నారు. కావున మిమ్మికనైన విడచువాడనుగాను. ఓరీ సేవక! వీరిద్దరంగొంపోయి కారాగారమున బాధింపుము.

సేవ—చిత్తము (దేవకీ వసుదేవుల బలవంతముగ లాగికొనిపోవును)

కంసు—తమ్ముడా! శంఖుడ! జరిగినకథయంతయు గన్నులార జూచుచుంటివికదా!

ఉ. బాలికయే యటంచుమది । భావనజేసి వధించుబుద్ధిచే
రాలను గొట్ట నంతనె బి । రాన వియత్పథ మంటి శక్తియై
క్రాలుచు నన్నుజంపగ నొ । కండుకలండని చెప్పిపోయె, నే
లీలను వానిగాంచి విద । ళింతును, యోచన దోచదేమియున్.

శంఖు—అన్నయ్యా ! ఈ చరిత్రమంతయు నాకు గడు నాశ్చర్యముగ నున్నది. ఆ నారదుని వాక్యముల ననుసరించి సర్వమును దైవ నిర్ణయమేయని తెలియుచున్నది. ఈవిషయమై మన ప్రయత్నములన్నియు వ్యర్థములే కావచ్చును.

కంసు—తమ్ముడా ! ఆ యశరీరివాక్యములలో గొన్ని యసత్యములు కానవచ్చుచున్నవి. ఏమందువా !

గీ. ఎనిమిదవచూలు నను హరి । యించుననుచు
దొలుత వచియించెనిపుడది । తొలగిపోయె
యన్యుడింకొక డున్నవా । డనుచుబలికె
నిందు నిజమేదియని వచి । యింపగలము.

శంఖు—నాకిది యంతయు మాయానాటకమువలె నగపడుచున్నది.

కంసు—ఇందులకు నాకొక్క యుపాయము తోచుచున్నది.

గీ. యాదవులు సురలంచుక । దా ! వచించె
నారదుం, డిప్పుడీశక్తి । నన్నుజంప
బాలకుడు పుట్టియుండె న । న్బలికె గాన
జనుడు యాదవపిల్లల । జంపివేయ.

శంఖు—సరే అటులే చేసెదము.

కంసు—అంతియెకాక ధర్మరతుల బ్రాహ్మణుల యాగంబుల నామ్నాయముల సత్యశౌచముల, నాసంహారమునకు గారణుడని నారదుడు చెప్పినట్లు శ్రీహరి వసించుగావున వాటి ననుసరించి పరిఢవిల్లువారల రూపుమాపుడు. పోవుదము రమ్ము.

శంఖు—చిత్తము. (అందరు నిష్క్రమింతురు.)






## చతుర్థాంకము.

### 1 రంగము:—వ్రేపల్లెవీధి.

[పూతన సుందరాంగియై ప్రవేశించును.]

పూతన—ఔరా కాలమహిమ! యెక్కడనో వ్రేలికణుపెడంత పిల్లవాడు పుట్టియున్నాడట. వాడేమో తన్ను జంపునని చట్టుపట్లనున్న పల్లెలలోని పిల్లలనందరిని జంపుమని మాకంస మహారాజు నాకాజ్ఞ నిచ్చినాడు. దొడ్డిలో గొడ్డును కొంపలో పిల్లయును లేని నేను పిల్లలజంపుటకు అడ్డములేదు కాని అయిన నెట్లు చంపుదునాయని యోచించి బాలింతరాలివేషమును ధరించి పాలిండ్లకు విషము బూసికొని యాశిశువులకు బాలిచ్చి చంపదలచితిని. నన్ను గాంచినవారెల్ల బాలింతరాలని తలంపకమానరు. మాయవేషములలో మొదటిపట్టముగొన్న నావేషము నెవ్వరు నమ్మకుందురు. సందేహములేదు. (తెరలో) నీవు చచ్చుటకు సందేహములేదు. (అదరిపడి) ఇదేమి చెప్పుమా! యీపలికినవాడెవ్వడై యుండును. ఔరా! యెవ్వడవురా నీవు. నాకీయాశీర్వచన మిచ్చినది! ఛీ క్రూర! నాయెదుట బడితివేని నిన్నే చంపెదను. ఉహుఁ యీమేనులేని వెధవలమాటలతో నాకేల? అదిగో పిల్లల యేడ్పులు వినవచ్చుచున్నవి. నే నచ్చటకు బోయెదనుగాక.

(నిష్క్రమించును.)

2 రంగము:—మందిరము.

[యశోద రోహిణి కృష్ణునితోట్టితో బ్రవేశించెదరు.]

యశోద—అక్కా రోహిణి! ఎన్నడును యేమను నెఱుంగని కృష్ణుడు నేడది యేమొ యకారణముగ నేడ్చుచున్నాడుకదా! యెంత జోలపాడినను మానకున్నాడమ్మా.

రోహి—కుండగీమనకు దృష్టిదోషము తగిలినదేమో నే.

యశోద—ఏమో కానవచ్చును. చిన్నికృష్ణా! కృష్ణ!

గీ. మాటమాట కులుక నీ మానుమురాబిడ్డ!
యెన్నడేడ్చియెఱుగ నీ విట్టులనీవు
లేనిదుఃఖకెట్టు నీ లీలజూపెదు
బూచియదిగో నిదురపో బొమ్మకుఱ్ఱ!

రోహిణి—యశోదా! ఇదేమి వింత యే.

గీ. కెవ్వకెవ్వమనుచు నీ కేకలు వేయుచు
నోరులు బిలచునట్టు లేడిమియేడ్చె
గనులలోన నశ్రు నీ కణమొక్కడునుదోప
దేమి మాయమొక్కొ నీ యెరుగబడదు.

యశో—ఔనమ్మా! అందుచేతనే యొక్క జోలపాట బాడెదవేమో యని నిన్ను బిలచితిని.

రోహి—యశోదా! ఆ వచ్చు సుందరాంగి యెవ్వతెయో యెంత చక్కగ నున్నదే!

పూతన—(ప్రవేశించి) అమ్మలార! ఆ విధంబుగ బసిపాపడేడ్చుచుండ బాలిచ్చియో జోలబాడియో లాలింపక యేల యిట్లుపేక్ష సేయుచున్నారమ్మా? ఇదివరకు బిల్లలగన్నవారు కారా! (చేరును.)

యశోద—ఓ దివ్యమంగళాంగి! నీ వెవ్వతెవు?

పూత—ఓహో బాగున్నది. ఆబాలు డావిధంబుగ బాలకై యేడ్చు
చుండ నన్ను బరామర్శ సేయుచుంటిరా ! చాలుజాలు. (కృష్ణు
నెత్తుకొనచేరును.)

యశోద—గీ. ఆగుమాగుము నాబిడ్డ నంటవలదు
యెత్తుకొనకమ్మ నీపుపా లీయకమ్మ
ఒల్లఁబుకదమ్మ నీపాల నుడుగుమమ్మ
సాహసము జేసికొనకమ్మ చంటిబిడ్డ.

పూత—అయ్యోతల్లీ! యిదేమి చోద్యమమ్మ !
గీ. చంటిబిడ్డఁగలుగు సతినమ్మ మీచిన్ని
బాలుజూడఁ జేపు వచ్చెబాలు
పోరుపెట్టగాన మీరు గోరకయుండ
బాలనొసగదలఁప వీలులేదె.

చాలుచాలు! యెక్కడ నేర్చితిరమ్మా యీపోకిళ్ళు. నేనేమి తాగుబోతుననుకొంటిరా? దయమాలినదాన ననుకొంటిరా ?

మోహి—సుకతీ ! అట్టులైన బాలిమ్ము.

పూతన—(ఎత్తుకొని యూరకుండును. పాలిచ్చును.) బిడ్డా ! వదలుము వదలుము. ఇదియేమి చోద్యమమ్మా ! నామేనిలోని పాలేకాక రక్తముగూడ హరించినావు. హా చెనుగుబిడ్డా ! వదలుము. వదలుము. హా ! చచ్చితి! హాహా ! అరరే! అల్లల్లా (వికృతాకారముతో గూలును.)

యశోద—అయ్యో! అయ్యో !! యిదేమి వింతమ్మా.

రోహి—ఆహా చెల్లెలా! యిదేదో రాకాసి.

యశోద—హానాథా! హా యాదవులార! యిక్కడ నుత్పాతము జరిగినది. రాకాసివచ్చినది. రండు. రండు (నందుడు గోపకులు ప్రవేశించెదరు.)

నందు—గోపకులార!

గీ. అతిభయంకరరూప యీ యసురమెవతొ
పాలొసంగగవచ్చి యీ లీలగూలె
ఆశ్రితావనచణుడు శ్రీ హరిమనమెడ
గరుణచేదీని బాలియించి కాచె నిపుడు.

(బాలునిదీసి యెత్తికొని) గోపబాలకులార యీరాకాసిని గొడ్డళ్ళచే దునియలుచేసి యావలకీడ్చివేయుడు.

గోపా—చిత్తము (అట్లుసేతురు)

నందు—నెలంతలార! నేను కంసునకు సుంకము జెల్లింపబోయి వచ్చు సమయంబున వసుదేవుని జూడబోయితిని. ఈయర్భకుండు తనబాలుడనియు గారణాంతరమున నీపల్లె ప్రక్కలోనుంచబడె ననియు వీనికి గంసభయము కలదనియు నిదిమొదలు వ్రేపల్లెలో నుత్పాతంబులు కలుగుననియు బహుభద్రముగ నుండుమనియు నాతో జెప్పెను. అందులకు దార్కాణముగ నీరాకాసి కంసుని పంపునవచ్చి బాలునిచంపదలచి దైవకృపచే నిదియే మడసెను. కావున మనమీబాలునకు దృష్టిదోషపరిహారములను సేయుదమురండు.

యశో—చిత్తము. (అందరు నిష్క్రమించెదరు.)

3 రంగము—సభాభవనము

[కంసుడు శంఖుడు ప్రవేశించెదరు]

కంసు—తమ్ముడా!

మ. ననుజంపంగల బాలకుండొకడు జన్మంబెత్తి యున్నాడటం
చును వాక్రుచ్చిననాటగోలె మదిలో సుస్థైర్యమ్ము లే
దనుమానంబును పెద్దభూతమున కత్యంతంబులోనైతి భో
జనమా! యుండను నిద్రపట్టదు మన సౌఖ్యంబునుం బోయెగా.

శంఖుడు—అన్నయా! తనకుశత్రువుడొక్కడున్నాడని వినినవానికి సౌఖ్యములుగూడ గష్టములై పరిణమించుట సహజమేకాని ధైర్యమవలంబించి శత్రుసంహారమునకై ప్రయత్నించవలెను.

కంసు—తమ్ముడా! యిపుడు ప్రయత్నించినదానికింత సఫలమైనదికదా!

గీ. జగములనుబట్టి మ్రింగగా ౯ జాలినట్టి
పూతనాభిఖ్య రాకాసి ౯ పోయి శిశువు
నకు విసపుబాలొసంగ న ౯ ర్భకుడుపట్టి
పాలుద్రాగుచుదాని ప్రా ౯ ణాలదీసె.

శంఖు—ఈకారణమున నింగికెగిరిపోయిన శక్తిచెప్పిన బాలుడితండే యని తలంచెదను.

కంసు—ఓయి!

గీ. ఆ యశోదకుమారుని ౯ హతమొనర్ప
దిరిగి శకటాసురుని బంప ౯ నరిగియుండె
నింతకును రాకయుండె వా ౯ డెట్టిగతిని
బొందెనో తెలియగారాదు ౯ డెందమదలె.

శంఖు—పూతన యాడుదియగుటచే జచ్చెనుకాని శకటదైత్యుడు విజయమునే పొందిరాగలడు.

(తెరలో) హా కంసమహారాజ! యింకను శకటాసురునకు జయమను చున్నావా!

కంసు—ఎవడురా ఆచెప్పునది?

బహుళోదరుడు—(ప్రవేశించి) స్వామి! నేనుబహుళోదరుడను.

కంసు—ఏమి? శకటాసురునకుగూడ నపజయమే తటస్థమైనదా.

బహు—అపజయము అపవర్గసుఖముగూడ దటస్థమైనది (యేడ్చును)

కంసు—ఏడ్చెదవేమిరా! చచ్చినాడాయేమి?

బహు—చావకుండ స్వర్గమెట్లువచ్చును దేవా! ఆనందుని బాలుడు నిక్కముగ మూరెడున్నవాడు. మా బావ శకటాకృతిచే దూల మువిూదనుండ నెగిరి యొక్కతన్నుదన్నినాడు. వానికిగొంతదూరమున నెలుకనైయున్న నేనదిగాంచి పైకప్పు జించుకొని బైలుపడి ప్రాణాలు దక్కించుకొంటిని.

కంసు—ఓరీ! ఆపాదప్రహారమునందిన పిమ్మట మిూబావగతి యే మయ్యెను.

బహు—తరువాత హా యని యార్పు వినిపించినది. పిమ్మట బర్వతము గూలినట్లు చప్పుడు వినవచ్చినది. గోపకులందరు గొడ్డండ్రను దీసికొనిపోవుట జూచి వానికళేబరమును తునియలుచేసి యావలకీడ్తుమని వారల మాటల నాలించి చచ్చెనుకదాయని యీవార్త మిూకు జెప్పుటకై వచ్చితిని.

కంసు—హా మిత్రుడా! శకటాసుర! నాకొరకు నీవు ప్రాణముల విడచితివా! అహా యెంతగతిపట్టెనోయీ!!

బహు—బాబూ! నీకేమికాని ముందు నాతాడు తెగినది.

కంసు—అదేమిరా!

బహు—ఇంకేమున్నదిరాజా! నాచెల్లెలు ధూమాక్షికి వైధవ్యమువచ్చి నాకొంపమిూద బడును. దానిని మేపలేక నాతాడు తెగును.

కంసు—ఓరీ నీవావలకుబొమ్ము. నేను పోషించెదనులే.

బహు—(తనలో) నా బావ చచ్చినాడన్న విచారము నాకిప్పుడు లేదు
(నిష్క్రమించును)

కంసు—తమ్ముడా శంఖుడా!

చౌ. నెలలవయస్సువాడు రజనీచరయోధునిజంప మింటికే
కలన బలాంకుడై యెగిరె గాంచిరె వింటిరె మున్నునిట్టి దో

ర్ధ్యలులను వింతయయ్యె నను బట్టివధింపగ బుట్టినట్టి యు
జ్జ్వలబలశాలియూతడన వచ్చును సంశయమేలతమ్ముడా?

శంఖు—ఇంకను సందియమేమి! వాడేమనశత్రువు లేకున్న మూరెడు పిల్లవాడేమి? దూలమున కెగిరి శకటాసురు గూల్చుటేమి!!

కంసు—అన్నన్నా! వానినెట్లు చంపితునోయి!!

గీ. ఇద్దరినిబంపి చంపించి యింతవరకు
నెందరినిబంపి చంపింతు నీవిధమున
నక్కటా! తోచదేమియు నైననింక
నొకతృణావర్తు బుత్తుబా లకుని జమ్ము.

శంఖు—అన్నయ్యా! ఒక తృణావర్తునే యననేల? శత్రుని శ్శేషమగు వరకు బకాసుర వత్సాసుర ధేనుకాసుర అఘాసురాది గానిన వీరులబంపి యెట్లో వానిని దుద ముట్టించవలయును.

కంసు—అవునదినిజమే. సేవకా! నీవుపోయి తృణావర్తుని దోడితెమ్ము.

సేవకు—చిత్తము (నిష్క్రమించి తృణావర్తునితో వచ్చును.)

తృణా—స్వామి! నమస్కారము.

కంసు—ఓయి! నీకు భద్రముకలుగుగాక! నాకొక్క యుపకారము సేయవలయు నంద నందనుడు నాచే ప్రేరేపింపబడిన పూతన శకటాసురుని గీటడంగించె. నీవుపోయి వాని నేవిధముననైన జంపిరావలయును

తృణా—(తనలో) అక్కటా! యిక నాచావుకూడ మూడినట్లే. ఏమి సేయుదును. సమ్మతింపకున్న నీతడే ననుజంపును (ప్రకాశము) స్వామి! నాకుమిక్కిలి రోగముగానున్నది. తరుచు శూలబాధచే నుగిలిపోవుచున్నాను. నాకు నడుచుటకే శక్తిలేదు (శూలబాధ నభినయించుచు) అయ్యో! శూలనొప్పివచ్చినది. హాహా! చచ్చిపోవుచున్నాను స్వామీ! కడుపులో శూలము బుచ్చు

కొని పొడిచినట్లు శూలించుచున్నది. దేవా మఱియొకరి నంపుము.
అబ్బా !! అయ్యో ! (పడిపోవును)

కసు—ఓరీ మాయానటన సేయుచుంటివిగా !

గీ. స్వామి కార్యార్థమై యింత | సంకటంబు
కలిగె ! పోకున్న నిన్ను నా | ఖడ్గమునకు
నైన నెఱజేతుసుమ్ము | మాయానటనము
సేయనమ్మెదునే పొమ్ము | శిశువు జంప.

తృణా—దేవా ! ఆగ్రహింపకుడు పోయెదను (తనలో) ఇంతకును నాభార్య మంగళసూత్రపు దారిగట్టి యెట్లున్నదో అట్లుజరుగును.

కంసు—ఓరీ తృణావర్త !!

గీ. నీవు సుడిగాలి వైనందు | నసువుబట్టి
యెత్తికొనిపొమ్ము మింటికై | యెట్టులేని
వానిగడతేర్ప వలెనీ పని | భూవమహిమ
జూపెదవుపొమ్ము వేగ దిని | శుద్ధిమతిని.

తృణా—ఇప్పటికి నా బాధ కొంచె ముపశమించినది. తప్పక మీరు చెప్పినట్లే చేసెదను.

కంసు—మంచిది వేగబొమ్ము. వానినివధించి నాకనులబడుము.

తృణా—చిత్తము (తనలో) నేను బ్రతికియుండినగదా !

(అందరు నిష్క్రమించెదరు.)

## 4 రంగము డోలికాభవనము.

[రోహిణీ యశోదలు కృష్ణుని జోలపాడుచు ప్రవేశించెదరు.]

యశోద—  పాట-కమాచిరాగము, రూపకము.

1. జోజో రవికులచంద్ర రామా । జోజో దశరథపుత్రకా ।
జోజో శ్రీరఘురామచంద్రా ! । జోజో సద్గుణధామా॥ జోజో॥

2. గాధిపుత్రుని యజ్ఞరక్షణ । కేగడంగుచు ద్రోవలో ।
బాధజేసెడు తాటకిని సు । బాహుముఖులను జంపవే॥ జోజో॥
3. అంఘ్రిరజమున రాతియైన య । హల్య శాపము బాపవే ।
శివుని చాపము విరచి జానకి । శ్రీవెలయ బెండ్లాడవే॥ జోజో॥
4. పరశురాముని గర్వమడచియు । భరతునకు గురునాజ్ఞచే ।
అఖిలరాజ్యం బొసగి వనముల । కరుగవేభూపుత్రికతో॥ జోజో॥
5. పంచవటిగల పర్ణశాలను । మించుబోణివి సీతను ।
వంచకుండగు రావణుండు హరి । యించి లంకకుబోవడే॥ జోజో॥

కృష్ణుడు—(తొట్లెనుండి లేచి చేతులుసాచి) పాట. బేహాగు-ఏకతాళం.

1. ధనువును దెమ్మా లక్ష్మణ । దనుజుని గూల్తు లక్ష్మణ ! ॥
జనకజ గొంపోయెనంట । చంపివై చెదగ॥ దనుజుని॥

యశోద } ఓహో ! యిదేమిచిత్రమమ్మా ! యీకృష్ణుని రౌద్రము
రోహిణి } జూడలేకున్నాము. (పారిపోవుదురు.)

కృష్ణు—పాట.

2. అఖిలరాక్షసుల లంకను । హతముజేసెదన్ ।
నిఖిలసురలు పొగడ సీత । నెమకిగాంచెదన్॥ సీత॥ న॥

నారదుడు—(ప్రవేశించి) మహాత్మా ! శాంతింపుము. ఇది త్రేతా యుగము కాదు. నీవు శ్రీరాముడవుకావు. లక్ష్మణుడిందు లేడు. సీత నిపుడు రావణుండెత్తుకొని పోవలేదు. ఇది ద్వాపరయుగము. కంసాది దుష్టసంహారమునకై దేవకీవసుదేవులకు కృష్ణ నామంబుతో జనించి నందుని భార్య యశోదచే బెంపబడు చుంటివి. ఆనాటి రామచరిత్రను యశోద నీజోలపాటగా బాడు చుండ నీకు రామావతారావస్థ స్మృతికి వచ్చి ఆగ్రహించినాడవు. కావున బ్రశాంతిని వహింపుము.

కృష్ణు—ఏమీ ! యిది ద్వాపరయుగమా, (మరల నిద్రించును.)

నారద—(నిష్క్రమించుచు) చిత్రము.

[రోహిణీ యశోదలు ప్రవేశించెదరు.]

యశోద—అక్కా రోహిణి! ఇదేమి చిత్రమమ్మా! అవిధంబుగ జేతులు సాచి రౌద్రమును జూపిన కృష్ణుకు యెవ్వడో జడదారి వచ్చి యేమేమో చెప్ప నంతలో శాంతివహించి పండుకొనెను. ఆ మునియు నప్పుడే మాయమైపోయెను. ఇది కడు చిత్రముగ నున్నదమ్మా! కృష్ణుని లేపుదునా.

రోహి—కృష్ణుని చరిత్రమును దర్శించుటకు మనము చాలము. కృష్ణుని లేపుము!

యశోద—కృష్ణా! కృష్ణా! (భయము నభినయించును.)

కృష్ణు—(లేచి యెత్తుకొనుమని చేతు లిచ్చును.)

యశో—(ఎత్తికొని) నాయనా! ఇప్పుడేమని పలవరించితివి.

కృష్ణు—నాకు దెలియదు.

రోహి—పలుకరింపక తీసికొనిరమ్ము. పాలు త్రాగింతము.

(అందరు నిష్క్రమింతురు.)



5 రంగము—వ్రేపల్లె వీధి.

[యశోద రోహిణులు ప్రవేశించెదరు.]

యశోద—(ఆతురతతో ప్రవేశించి) హా చిన్నికృష్ణా! (చేతు లాకసమున బెట్టి) హా నాముద్దులయ్యా! హా బిడ్డా! (మూర్ఛబడును)

రేవతి—హా ప్రాణనాథ! హా గోపకులార! మన కృష్ణుని సుడిగాలి యెత్తుకొనిపోయినది. వేగవచ్చి రక్షించుడు, రక్షించుడు. (ఆకసమున జూపు నిలిపి) ఆహా! యేమి యాశ్చర్యము! చెల్లెలా! యశోద! లెమ్ము లెమ్ము. మన కృష్ణుడు బ్రతికినాడు.

యశో — ఏడీ! ఏడీ! నిజముగ బ్రతికివచ్చెనా?

రోహి — అదిగో ఆకసమున జూచుచున్నా? ఒక్క భీకరాకారుని రాక్షసుని కంఠమును బిగియబట్టుకొని క్రిందికి లాగుకొనివచ్చుచున్నాడు.

యశో — అక్కటా! క్రిందబడిన ప్రాణముల బాయునేమోకదా.

(తృణావర్తుని కంఠముబట్టుకొని వ్రేలాడుచు గృష్ణు డాకసము నుండి భూమిని బడును)

రోహి — యశోదా! దానవుడు చచ్చినాడు. బాలకుని వెలికి దీయుదము (బాలునిదీసి యెత్తుకొనును.)

యశో — నాముద్దులకృష్ణా! రాక్షసుని బాటిబడితివా! నీకపాయము రాలేదుకద!

కృష్ణు — వాడే చచ్చినాడు

రోహి — చెల్లెలా! దృష్టిదోషము దీయుదమురమ్ము. ఈదనుజుని మనగోపకు లావలకీడ్చి వేయుదురు.

యశో — బిడ్డా! శ్రీకృష్ణ!

గీ. ఆపదలమీద నాపద లలముకొనగ
గాచికొనుచున్న వాడవే! కన్నతండ్రి
అల్పులముమేము నిను బ్రోచు నట్టిశక్తి
మాకు సుంతయు గలదె! కుమారతిలక.

అక్కా రమ్ము. దృష్టిపరిహారము సేయుదము.

(అందరు నిష్క్రమించెదరు.)





శ్రీ

# సంగీత కృష్ణలీల.

పంచమాంకము.

కృష్ణ—(ప్రవేశించి బంతి నెగురవేయుచు)

గీ. బంతిమాటలాడ ౯ బరుగున రారయ్య
పిల్లలార! గొల్ల ౯ బిడ్డలార!
గెలుపు నోటులేని ౯ ఖేలనమదియేల
క్రొత్తయాట నేర్చి ౯ కొందుముగాక.

[బలరాముడు గోవిందుడు ప్రవేశించెదరు.]

బలరా—తమ్ముడా! బంతియాటలో దేని నాడుదమురా?

గోవిందు—కుండబాతి యాడుదము.

కృష్ణ—అన్నయ్యా! గోవింద! బంతియాటయని పిలచినగాని మీరు రారని అట్లుపిలచితిని కాని క్రొత్తయాట నొకటియాడుదము. ఏదందురా!

గీ. పశుపతిని నేను మీరెల్ల ౯ పసులుకంచు
ధరణిపై చేతులనుమోపి ౯ తలలవంచి
మేయు చున్నట్లునటియించి ౯ మెలగవలయు
బాలనము సేతుమిమ్ము నీ ౯ గోలతోడ.

గోవిం—అటులైన సరియే. మే మిదేపసులమగుచున్నాము. (అట్లు చేయుదురు.)

కృష్ణు—గోపకులార ! నేనిదె కాచెదను. (కొట్టును.)

గోవిం—కృష్ణా చచ్చితిమిరా !! ఈదెబ్బలు పడలేక మేమీయాట
నాడము.

కృష్ణు—హితులార: ఎందుకు గొట్టితినో తెలుయునా !

గోవిందు—తెలియదు

కృష్ణు—చెప్పెద వినుడు

గీ. పశువులట్టులవర్తింప వలదె వందు
గడ్డికైయాసపడరాదు కలలనైన
ననుచు మిమ్ములగొట్టితి ననుజులార
మంచిగోనముల త్రోడ జరించవలయు.

బల—తమ్ముడా ! దాని యర్థమేమో వివరించి చెప్పుమా

కృష్ణు—అన్నయ్యా ! ఇదిధర్మము ఇదిఅధర్మము అని తెలిసికొని
ధర్మమునే అనుసరించి ప్రవర్తింపవలెను. మరియు ననుచితమ్ము
లైన కార్యములకు సిద్ధపడరాదు. అట్లుపశువువలె ప్రవర్తిం
చిన వానికి బాధలుకలుగునని కోలతో దండించితిని.

గోవిందు—చక్కనినీతినే నేర్చికొంటిమిరా కృష్ణా ! ఒకసారి బంతియా
డికొని వేగయిండ్లకు బోవుదమురమ్ము.

కృష్ణు—సరే ! బంతు లెగురవైచి యెవరిబంతి దూరమెగురునో చూచి
వాడు జయముపొంది నట్లెంచుదము.

బల—అట్లైన నెగుర వేయుడు.

అందరు—(బంతుల నెగుర వేయుదురు)

కృష్ణు—అరరే ! అన్నా నాబంతి ముకుందుని దొడ్డిలో బడినది నేను
పోయి తెచ్చికొందును మీరిచ్చటనే యుండుడు.

(నిష్క్రమింతురు)



2 రంగము—గోపిక గృహద్వారము

కృష్ణుడు—(ప్రవేశించి తలుపుకట్టును) ఎవరీయింటిలో నున్నది! తలుపు తలుపు.

సారసిక—(ఇంటిలోనుండి) తలుపు పలికినదా!

కృష్ణు—తలుపు పలుకును నీకులుకులు పలుకును.

సారసి—(యింటిలోనుండి) ఏమీ! కులుకులు పలుకవలెనుగా?

కృష్ణు—పలుక కేమి సేయుదు? తలుపు దీయుము.

సారసి—(పలుకదు)

కృష్ణు—ఏమి పలుకవు! తలుపు తీసెదవా! లేదా! సారసికా!

సారసి—మొదటనే అట్లు పేరుపెట్టి పిలువరాదా! ఎవ్వడవు నీవు?

కృష్ణు—నేను శ్రీకృష్ణుడను.

సారసి—ఏమి యెందులకు?

కృష్ణు—కొంచెము పనియున్నది.

సారసి—కొంచెమన నెంత?

కృష్ణు—తలుపు దెరచిన నెంతో చెప్పెదను.

సారసి—(తలుపు తెరసి ప్రవేశించి) ఎంతపని?

కృష్ణు—(పద్మకోశహస్తమును బట్టి) ఇంతపని.

సారసి—ఓరీ! కొంటెవాడా! ఇంతపని యనగా నెంత?

కృష్ణు—ఇంతేయనగా నింతే.

సారసి—(కృష్ణుని బుగ్గ గిల్లుచు) ఏమీ! అలాగునా!. నీపని యేదో విస్పష్టముగ జెప్పుమా.

కృష్ణు—సరిసరి ఏమిపనియు నుండవలె కొంటివా! అనేక పనులున్నవి. నేను లేనిపనులేమికలవు. ముందు మీదొడ్డిలోనికి బోవలయు. నాదు నాఆటబంతి పడిపోయినది.

సారసి—నీవులోపలి దొడ్డిలోనికి బోరాదు.

కృష్ణు—ఏమి యొందువలన ?

సారసి—నాచెల్లెలు పల్లవాధరి నీళ్లు పోసికొనుచున్నది.

కృష్ణు—అందువలన నాకభ్యంతర మేమి? కాసారమున నెందరు నీళ్లుపోసి కొనుటలేదు ? వారల జూచుచుండుటలేదా ?

సార—ఇది యట్లు కాదు.

కృష్ణు—ఏమి యొందువలన ? కాక మరెట్లు ?

సార—నీకావిషయ మెందులకు ?

కృష్ణు—నీవు పోవద్దనుటచేత.

సార—ఆయంశము నీతో చెప్పరాదు.

కృష్ణు—సరే తెలిసినదిలే.

సార—ఏమి తెలిసినది ?

కృష్ణు—వివస్త్రయై యున్నదని.

సార—ఔనట్లే.

కృష్ణు—సారసికా ! పంచభూతములును గగనమందున గ్రహమండలములు జూచుచుండ నీచెల్లెలు వస్త్రవిసర్జనయై నీళ్లుపోసికొన నేను పిల్లవాడను చూచిన తప్పువచ్చినదా.

సార—ఔను. తప్పే నీబుద్ధిచపలము.

కృష్ణు—మీమనంబులు చపలములుకావో ?

సార—కావు. పోవలదు.

కృష్ణు—అట్లైన నేనాపొంతకు బోవక నాబంతి నేను తెచ్చికొనెదను. పోనిమ్ము మా ఆట లాగిపోయినవి.

సార—అట్లైన నాపొంతకుబోవక నీబంతి తెచ్చికొనుము.

కృష్ణు—(తనలో) నేనులేనిచోటేది వేరేపోవలయునా! (ప్రకాశముగ) సారసికా ! అట్లేచేసెదను (లోపలకుబోవును)

సార—ఈకృష్ణుఁడు బాలుడైనను అందముఁగలవాడు. అతివిజ్ఞాని. లేకున్న నింతదూరమువరకు యోజించి మాట్లాడునా! బాల్యప్రాయమునందే అనేక రాక్షసుల సంహరించినాడు. వీనిచర్యలు విష్ణులీల లనవచ్చును.

కృష్ణ—(లోపలనుండివచ్చి) ఓహో సారసికా! ఎంతమోసమును జేసితివే. నాబంతి సంగ్రహించి దాచికొని నన్నుదొడ్డిలోని కని పెదవుగా! నాబంతియిచ్చి కదలుము. లేకున్న నిన్ను గదలనీయను (చేయిపట్టుకొనును)

సార—కదలనీయక యేమిచేసెదవు.

కృష్ణ—ఏమిసేయవలెనో అదియే చేసెదను.

సార—ఏమీ! అదేచేసెదవుగా! (బుగ్గలునులిమి) నీవుచూడ గొంచెము. పోకిళ్లుచూడ బెద్దవి.

కృష్ణ—(తిరిగి దానిబుగ్గలునులిమి) ఆఁ చేయక యూరకుందునా!

సారసి—ఓసీ పోకిరీ! నాబుగ్గలునులిమెదవుగా! నీవుమంచివాడవు కావు. ఆవలకుబొమ్ము (బుగ్గలుపట్టిత్రోయును)

కృష్ణ—(దానిచేయిపట్టుకొని) నాబంతినిచ్చువఱకు నిన్ను విడువను నేనుపోవను.

సార—నీబంతియెక్కడ? నాచెంత లేదు.

కృష్ణ—ఓహో! కృష్ణుడు నీమాయలో బడువాడుకాడు. నీవుబంతి నెక్కడ దాచితివో నేనెరుంగకపోలేదు. వేగనాబంతినిమ్ము.

సార—నేనెక్కడ దాచితిని? నీవేమి మొఱుగుదువు.

కృష్ణ—అదిగో పైటలో! నీవిచ్చెదవా? నేను తీసికొనవలెనా?

సార—ఏమీ! నాపైటలో జెయిపెట్టెదవుగా (బుగ్గలునులుముచు)

కృష్ణ—అదిగో మాటిమాటికి బుగ్గలునులుముచున్నావు. నీయదృష్ట మెటులనే నేను వడ్డిత్రో దీర్పవలసియున్నది.

సార—ఏమి బిడ్డీ యొసంగెదవు.

కృష్ణు—ఒక బిడ్డీ యొకముద్దు బెట్టుకొందును. నాబంతినిమ్ము.

సార—ఔరా! యెంతరసికుడవు. నన్ను ముద్దుబెట్టుకొందువుగా పలుగా (రెండుబుగ్గలునులుపుకొను)

కృష్ణు—ఇదిగో నాబంతి (దానిపైటచెరలాగుబంతిని దీసికొని ముద్దు బెట్టుకొనును)

సార—(తనలో) ఇదేమి ఆశ్చర్యము! వీనిబంతి నాపైటలోని కెట్లువచ్చినది! యిదియంతయు విష్ణుమాయగనున్నదే.

కృష్ణు—నన్ను విడువుము. నేనుపోవలయును.

(తెరలో) అక్కా! నావల్వనెవ్వడో తస్కరించుకొని పోయినాడు. కృష్ణుడిట్లురాలేదుకద!

సారసి—ఓరీదొంగకృష్ణా! మాచెల్లెలి చీరనెత్తికొనిపోవుచుంటివిగా (చంకనున్నచీరనులాగును)

కృష్ణు—నాబంతి నీవు దాచుటచే నీచీరచే బంతికుట్టుకొనదలచి తెచ్చితి. బంతినిచ్చితివి కావున దీసికొనుము. నేను పోయెదను. (నిష్క్రమించును)

సార—నీనిచర్యలకు నామనంబు కరుగుచున్నది కానిమ్ము. తరువాత నాలోచించెదను. (నిష్క్రమించును)



3. రంగము గోపికాగృహము పెరుగుకుండల యుట్టియు నుండును.

కృష్ణు—(ప్రవేశించి)

గీ. గోపసతులయిండ్ల ౯ గొల్లలుగావెన్న
పాలుపెరుగుదొంగి ౯ పరమతుష్టి
దనిసివీరినెల్ల ౯ దరియింపజేసెద
భక్తిపరులబ్రోవ ౯ వలదెకరుణ.

(ఉట్టిమీదకు జేయిసాచి యందకున్న బీట నెత్తి పెట్టి క్రిందదూటుపొడిచి పెరుగుదాగుచుండును) అదిగో నెవ్వరోవచ్చుచున్నవారు. వచ్చుగాక (తాగుచుండును)

పల్లవాధరి—(ప్రవేశించి) ఓరిదొంగకృష్ణా! దొరికితివి లే.

కృ—మహామహులకైన దొరకనివాడను. నేను నీకుజిక్కుదునా! అయిన నేనేమిచేసితిని?

పల్లవా—అటులైన.

గీ. ఏమిగాక కృష్ణవచ్చితి వేలుయుటకు

కృ— లేగ వెదుక వచ్చితి లీలచెలియ

పల్ల— ఉట్లపై కలపనేమి యొదవెనీకు

కృ— పెరుగు నుండుననియొంచి వెతకుచుంటి.

పల్ల—ఏమిరా! దొంగవాడా! నీలేగ మాపెరుగుకుండలో నుండునని వెతికుచుంటివిగా! సరే మాఅత్తతో నీవు మాపాలు పెరుగుల దాగి పోవుచున్నావని చెప్పి నిన్ను శైమచేసెదను లే.

కృ—ఏమీ! నీకొగిలియను శైదులోనా నన్ను బాధించునది?

పల్ల—హా ఏమనుచున్నావు? దొంగవను లేగాక పోకిరీమాటలు గూడ నాడుచున్నావుగా!!

కృ—పల్లవాధర (దానిమాటికింత పెరుగురాశి) నీవు కుండలోని పెరుగెల్ల దాగి నామీద నేరముమోపుచున్నావుగా? మంచిది నీయత్తతో జెప్పెదనుండుము.

చంద్రవదన—(ప్రవేశించి) పల్లవాధర! నీమాటికి బెరుగెందులకు వచ్చినది. యీకృష్ణు డెందులకిట్లు వచ్చెనే?

కృ—చంద్రవదనా! మీయింటిలో పాలు పెరుగులు మీకోడలే తాగుచుండ నేను దినిపోవుచున్నానని నిత్యము నన్ను రవ్వసేయుచున్నారు. ఇదిగో మీపెరుగు దొంగను బట్టియిచ్చితిని,

పల్ల—నారాయణ నారాయణ! లేదమ్మా యీకృష్ణుడువచ్చి పాలు పెరుగు దాగుచుండ నేను చూచి యిదేమిరాయని యనుచుండ నామాటికి గొంతరాశి నేనే దొంగనని చెప్పుచున్నాడు. నేనబద్ధమాడిన నాకవ్వముతోడే.

చంద్రి—సరే మీయిరువురిలో దొంగ లెవరో నిర్ణయించి శిక్షించెదము రండు. (అందరు నిష్క్రమించెదరు)



4 రంగము:—మందిరము.

[కృష్ణ యశోదలు ప్రవేశించుదురు]

యశోద—నాయనా! శ్రీకృష్ణ!

చం. ఒకక్షణమైనగాల్చిలిపి కే యుండవు మందిరమందు, నాదు కండ్లకు బొడసూపి యంతనె చకేటులనబోయెద వెన్నిచోట్లకో అకట! శ్రమాంబువుల్ ముఖసుధాకరబింబమునందు నొప్పె మౌక్తికముల చెల్వమించుచును కేకృష్ణ! యిదేమి ప్రవర్తనంబురా.

వత్సా! మనయింటనున్న బలరామునితో నాడుకొనరాదా! యెప్పుడును పొరుగు పిల్లలతోడనే ఆడుకొనవలెనా?

కృ—అమ్మా! అటులే ఆడుకొందునుగాని వాడు నామీద నీతోకొండెములు చెప్పెదనని బెదరించుచుండును. అందుచేత వానిని విడచి యితర బాలురతో నాడబోయెదను.

బలరా—(ప్రవేశించి) అమ్మా! తమ్ముడేమిచేసెనో చూచితివా!

కృ—(చెప్పవలదని చేతితో సంజ్ఞ సేయును)

యశో—రామా! ఏమిచేసినాడు.

బలరా—మన్ను దిన్నవాడు.

కృ—అమ్మా! అదిగో చూచితివా! నేను చెప్పినట్లు కొండెములు చెప్పుచున్నాడు.

యశో—బలరామా! కృష్ణునిపై గొండెములు చెప్పుచున్నావా?
బలా—అమ్మా కొండెములుకావు నిజమే.
యశో—ఏమిరా కృష్ణ!
కృ—తల్లీ వీడు రెండునాల్కలువాడే.
బలా—అమ్మా వేయియేల? వెన్నునినోరు పరీక్షింపుము.
కృ—లేదులేదు నే తినలేదు.
యశో—చిన్నికృష్ణా! నీనోరొక్కసారి దెరువుమా.
కృ—(చూపనని తలయూచును)
యశో—నాయనా! కృష్ణయ్యా!

ఉ. ఎన్నడు నీచకార్యముల కేగవు చట్టెలతోడ నుట్లలో
నున్న యపూపముల్వకలు నుండ్రములన్నిని మోద ముప్ప మీ
యన్ననుగూడి యాపుకొన కక్కట గర్భదరిద్రురీతిగా
మన్నుదినంగనేల సుకు మార యిదెక్కడియల్పబుద్ధిరా.

కృ—లేదు మన్నుదినలేదు.
యశో—నీనోరుదెఱచి చూపుమా.
కృ—పట్టెడు వెన్నముద్దబెట్టినచో నోరు తెఱతును.
యశో—ముందునోరుదెఱువుము. తరువాత వెన్నబెట్టెదను.
కృ—నోరుచేతితో మూసికొని చేయిసాచును.
యశో—బిడ్డా నామాటవినుము నోరు తెరచిచూపుము.
కృ—

ఉ. అమ్మరో వెర్రివాడనుకో ఆకలిగొంటినె యుట్లమీద భ
క్ష్యమ్ములులేవె తింటకున హా పసివాడనె బుద్ధిలేదె నే
మమ్మును వీడిసీచువటె మన్నునుదింటకు వీనికొండెముల్
నమ్మకుమమ్మ నీవటుల నమ్మకయుండిన నోరుచూపుమా.

(నోరుచూపును.)

యశో—(చూచి ఆశ్చర్యముతో) ఆహా అత్యాశ్చర్యమే !

చం. మనసు చలించెనో కలయొ ? మాధవమాయయొ లేక నేను ని
ద్రను బడి నిస్పృహన్ దగిలి ? భ్రాంతి జెందితినో యశోద యన్
వనితను గానొ యీకొమరు ? వక్త్రమునందున మూడులోకముల్
గొనకొని నేను నాపసుల ? గూడ గనంబడె నట్టి చిత్రమో

ఆహాహా. యీనాయర్భకుని కుక్షికుహరమేడ సమస్తబ్రహ్మాండమ్ములు నానానదీగోత్రకానన జంతుసంతానంబులతో గనంబడుటయేడ! నాపురాకృత పుణ్యవిశేషంబునం జేసి విశ్వమయుండౌ నారాయణుండు నాకు బుత్రుడై జనించినవాడు. ఈకనుపించు విశ్వమెల్ల నీనియుదరగోళమున నాకన్నులకు గట్టినట్లగపడినదే! స్వామి! (చేతులుజోడించి) లక్ష్మీకళత్ర! నారాయణ!

ఉ. ఎట్టితపంబు జేసి జని ? యించితొకాని రమేశ నిన్ను నా
పట్టిగ నెంచి ప్రేమమున ? బాలన సేయుట కొగ్గె దేవ నీ
గుట్టెఱుంగ మౌనులకు ? గూడ దురాసదమౌగదయ్య నా
యట్టివివేకహీనకన ? నౌనె భవద్ఘనవిశ్వరూపమున్

కృష్ణు—(తనలో) ఇకమాతల్లికి నేను విష్ణుదేవుడను భ్రాంతిని మరలించి పుత్రవ్యామోహమును గలిగించెదనుగాక.

యశోద—వత్సా! శ్రీకృష్ణా! (యెత్తికొని) నీకు వెన్నమద్ది నిచ్చెదను భక్షించెదవా ?

[తెరలో]

మాయిండ్లలోని వెన్ననంతయు నీదొంగకొడుకే భక్షించినాడు.

యశో—ఎవ్వతెవే నాకొడుకుపై గొండెములు చెప్పుదానవు?

చంద్రవదన—(ప్రవేశించి) అమ్మా యశోద ! కొండెములు కావు వినుము.

ఉ. అమ్మ యశోద! నీ కొడుకు కల్లరి నేమని చెప్పుదాన మా
యిమ్ములలోని పాల్పెరుగు నెంతయు దొంగిలిపోయి మిక్కిలిం
డమ్ముల నన్యగేహముల దాచగ వారికి మాకునున్ మహా
గ్రమ్ముగ గయ్యాల్ జరిగె గంటివె యిట్టి విచిత్ర కృత్యముల్
అమ్మా తల్లీ! నీకొడుకొనరించు నల్లరిపనులిట్టివి అట్టివి అని వచింప జాలము.

యశో—చంద్రవదనా! ఆపని మాకృష్ణుడే చేసెనని యెట్లు తలంచితిరి.

చంద్ర—సరి సరి! అనేకసారులు మాచట్టిలలోని వెన్నదినుచుండ మాకోడలి నల్లరిసేయుచుండ బట్టుకొని నీకు జూపవలెనని పెట్టెలో బెట్టి తాళము వైచితిమి ఆతాళమటులే యుండు. నీ పిల్ల దూరి బాలురతో గేరుచు వీధులో గనుబడువాడు. పోయి పెట్టె జూచిన నది వట్టిదై యుండును.

గోపికలు—(ప్రవేశించెదరు) నిజమే నీకొడుకల్లరి వాడే!

యశోద—సరసరి యీమాట మిక్కిలి బాగున్నది.

గీ. చాలు మేలము సేతువే చంద్రవదన!
తాళములటుండ నేరీతి దరలివచ్చె
వినిన నమ్ముదురే యెట్టి వెఱ్ఱలైన
రవ్వసేతురె! నాబిడ్డ రమణులార.

చంద్ర—అట్లనకుము తల్లీ! నీకొడుకు దుడుకుపనులింకను గలవు. చెప్పెద వినుము.

గీ. మాటమాటని పిల్చి యీ మగువ పెదవి
గొరికిరారమ్మ పుట్టింతు కొడుకుననుచు
మేలమొనరించుచును మొల నూలు బట్టి
లాగజొచ్చెను పిల్లల లక్షణములె.

యశో—ఏమిరా కృష్ణ! యీమాటలు నిశ్చయము లేనా!
కృష్ణు—అమ్మా! యీగొల్లభామల మాటలనమ్మకుము.

గీ. ఆటలందున దమపిల్ల ౯ లందరికిని
మించినానని నన్ను సా ౯ ధించజూచు
చున్నవారమ్మ యెప్పుడీ ౯ యూరివారు
వారికొండెములను నమ్మ ౯ వలదు తల్లి.

యశో—బిడ్డా! ఎందులకు నమ్ముదునోయి.
చంద్రి—యశోద! మీయమూకు బాగ వారు కారు. నమ్ముము నామాట.
నే నసత్యము జెప్పుటలేదు.

గీ. నీ కుమారునిచేత జీ ౯ కాకుపడని
గొల్లపిల్ల యొక తెయు మా ౯ గూడెమునను
లేదుసుమి తల్లి! నీబిడ్డ ౯ లీలలన్ని
పోకిరీ పనులెసుమ్మి ౯ పొలతిమిన్న.

యశోద—ఆహా! యేమి! ఆశ్చర్యముగనున్న దే! ఓరా కృష్ణ! నీమీద
నే నేరముమోపుచున్నారే! ఏమిచెప్పెదవు?

కృష్ణు—గీ. ఏగ లేదమ్మ యెవ్వరి ౯ యిండ్లకేను
సేయ లేదమ్మ యల్లరి ౯ చెలులబట్టి
కానిమాటల జెప్పగ ౯ గడిగిరమ్మ
నమ్మబోకమ్మ వీరివా ౯ క్యమ్ములికను.

చంద్రి—యశోద! నీతుంటరికొడుకు చేసినయల్లరి నోప్పుకొనునా!
వీనిచేష్టలన్నియు బూసగుచ్చినట్లు చెప్పెదవినుము.

సీ. ఒకతె చెక్కిలిగిల్లు ౯ నొకతె ముద్దాడునిం
 కొక్కబాలకునిపై ౯ నెక్కియాడు
నొకతెపైబడి పిల్ల ౯ లుదయించు రనిపల్కు
 నొకదానిచేలంబు ౯ నూడబెరుకు

నొకచోట సఖులతో నుండి యాటలనాడు
నొకచాయ బసులలో నొదిగితిరుగు
నొకచోట బయల నిద్రించు సొక్కి మరచిన
పడతి వల్వాదెరల్చి పరిహసించు.

గీ. నిందునందున నిదియది చందమనుచు
నేమి చెప్పుదునమ్మ వి శ్వేశుకరణి
నల్లవేళల పనులందు నల్లచోట్ల
నీకుమారుడె కన్పట్టు నిశ్చయంబు.

మాయింట కృష్ణుడు వెన్నతిని మాపిల్లనల్లరి చేసినాడని నేను వీధికివచ్చి చెప్పుకొనగా మాయింటనుగూడ నాతడే అల్లరిచేసినాడని పలువురు నాతోడజెప్పుకొనసాగిరి. యెప్పుడని నేను ప్రశ్నింప నిప్పుడే యని బదులుచెప్పినారు. తుదకుబరిశీలింప నందరియిండ్ల నొక్క ముహూర్తమునందే అల్లరిచేసినట్లు కనబడినది. కృష్ణుడొక్కడో వేయిమందియో తెలియకున్నది. యిది యేమి దైవమాయయో కానరాదు యిందసత్యము లేదు.

యశో—అక్కట! కడుజిత్రముగనున్నదే! ఏమిరా కృష్ణ!

ఉ. అల్లరి పిల్లవాడవని యందురు కోమలులేక కంఠులై
చెల్లునె! యిట్టిచేతలను జేయుట రవ్వకుమూల మౌకదా
పిల్లడవీవు చూపులకు పెద్దవు కార్యగుణంబులందు, హా
చెల్ల! యకార్యముల్ జరుపఁ శ్రేయమె! మానుము దుండగంబులన్.

కృష్ణ—తల్లీ! వీరిమాటలలోని యసంగతముల గనిపెట్టలేదా!

గీ. ఏనొకండనె యిందరి యిండ్లలోన
నొక్కత్రుటికాలమున వెన్న మెక్కి చెలుల
బరిభవించితినన, నమ్మ వచ్చునొక్కొ
విశ్వమయుడనె! నే తథా విధము సేయ.

చంద్రి—ఔనౌనందులకు సందియమా! నీవుతప్పక విశ్వరూపుడవే. యెంచఁజూచిన నీచందమే! యేల కాకుండును.

గీ. పెరుగుకుండల కడనీవు ॥ పెరటిలోన
జవ్వనులు స్నానమాడెడు ॥ స్థానములను
నీవు, నడివీధి పిల్లల ॥ నీవు, గోష్ఠ
శాలలను నీవుకలవు వి ॥ శ్వమయుపోల్కి.

అమ్మా! యశోద! నేనన్నట్లు నీకొడుకు విశ్వమయుఁడో లేక ఐంద్రజాలికుఁడో కావచ్చును. మేము దండించుటకు మాకుదొరకడు. మేమకారణముగ నీరాచబిడ్డను రవ్వసేయు వారముకాము. యీతనిని మాయిండ్లకు రాకుండ నెట్లుదండించెదవో! అట్లు మందలింపకుంటివేని మేమీయూరువిడచి లేచి పోవలసినదే.

యశోద—అమ్మలార! మీరందరు మీమీయిండ్లకేగుడు. నేనిపుడే వీనిని దండించెదను.

చంద్రి—మంచిది.

యశోద—కృష్ణా! నీవల్లరిచేసిన మాటనిజమని నేను గట్టిగనమ్మినాను. నిన్నిప్పుడు దండించెద రా రమ్ము.

కృష్ణు—అమ్మా! యీకల్లరి గొల్లపిల్లల మాటచేత నేనా నన్నుదండించుట! నిజము జెప్పెదవినుము. యీగోపిక నన్ను జేసినయల్లరి.

గీ చిన్నికృష్ణ! నన్ను ॥ జేరరమ్మని బుగ్గ
గిల్ల కౌగిటలకు ॥ మెల్లదార్చి
ముద్దుగొనుచు గనుల ॥ మూసుకు గసిచేత
మోవి గోరికికృష్ణ! ॥ పోరయనియె.

చంద్రి—చాలుజాలు! సిగ్గుసిగ్గు! అమ్మానీకుర్రడెంతకైన దగినవాడమ్మా. మాపుణ్యముబాగున్నది. యిట్లుపన్నినవాడు ఆపైమాట

గూడ నాడగలడు. వేమి సుండరాదు. నీవుమాత్రము వీనికి దగినట్లు బుద్ధిచెప్పుము.

(గోపికలు నిష్క్రమించెదరు.)

యశోద—కృష్ణ!

ఉ. ఎన్నడు బూవ్రబోండ్లదరి కేగకుమా! పొరుగిండ్లనున్న పా
ల్వెన్నలు మ్రుచ్చిలింపక వివేకముతో మెలగంగ నేర్తువే
చిన్నికుమార! కొట్టుటకు జేతులు రావుకదన్న బుద్ధిమై
తిన్నగనుండుమన్న గుణధీరుడవై కడుగీర్తిగాంచుమా.

కృష్ణు—అమ్మా! ఆయంశము నాతో వేరే చెప్పవలయునా! నేను నిరంతరము లోకసమ్మతముగ బ్రవర్తించుచునే యున్నాను.

యశో—వత్సా! కృష్ణ! గోపికలవల్లరిచేయుట లోకసమ్మతమైనదేనా! అట్లుచేయవచ్చునా!

కృష్ణు—అమ్మా! అది అల్లరిసేయుటకాదు. అనుగ్రహించుట. వారిమనోరథముల ఫలింపజేయుట.

యశో—ఇుసీ చెడుగా! నిన్నిక దండింపక మాననను. నాచెంతకురమ్ము.

కృష్ణు—నేనురాను (దూరమునకు బోవును.)

యశో—కృష్ణా! నాహితవునాలింపుము.

గీ. చిన్నతనములోన శిక్షింపకున్నను
పిల్లలల్లరులను బెద్దలగుచు
జెడుచు బుద్ధివచ్చి పుడమిపై జరియించు
నపుడు దుఃఖపడుదు రాత్మలందు.

కావున నిన్నుదండింపకమాననను (పట్టుకొనబోవును.)

కృష్ణు—(పారిపోవును.)

యశో—కృష్ణా! నన్నలయించుచున్నావు. నాకుగోపము వచ్చుచున్నదిసుమి!

కృష్ణు—ట్లుగున గోపముమానరాదా !

యశో—నీవల్లరిని మానిన నేను గోపముని మానెదను.

కృష్ణు—నేనల్లరిని సేయనే లేనుకదా !

యశో—అదిగో అసత్యమాడుచున్నావు,

కృష్ణు—లేను. సత్యమునే వచించుచున్నాను,

యశో—ఓరీ కుండగీడ ! కృష్ణుడు జారుడు దొంగ యని ప్రసిద్ధినంది యనృతములాడెద వేమిరా !

కృష్ణు—అసత్యము కాదమ్మా నిజమేనమ్మా.

యశోద—నాచెంతకు రమ్మా.

కృష్ణు—కొట్టనని యానవేని వచ్చెదను.

యశో—నిను గొట్టను రా రమ్ము.

కృష్ణు—అటులైన సరియే (తల్లిని జేరును.)

యశోద—(కృష్ణుని పట్టుకొని) కృష్ణా ! దొరికితివి లే. యిపు డెందు బోగలవు.

కృష్ణు—ఏమి కొట్టెదవా ?

యశోద—కొట్టనని యభయం బిచ్చితినికదా !

కృష్ణు—మరేమి చేసెదవు.

యశోద—పొరుగిండ్లకు బోయి యల్లరి సేయకుండ గట్టివైచెదను. (త్రాడు వెతకును.)

కృష్ణు—(తనలో) ఆహా ! మాతల్లి యెంత వెర్రిదో.

మ. భవబంధంబులు గాలపాశములు శుంభద్భల్లోహ సూత్రంబులున్
　భువినన్బంధితు జేయగాగలవె ! యేపుణ్యాత్ముడో ! ఆత్మభ
　క్తివిశేషంబున గట్టుగాక నను శక్తిన్ లేని నాతల్లిసుం
　త వివేకంబును లేక గట్టుటకు సిద్ధంబయ్యోనే దద్దిరా.

అగుగాక నన్నీమె యెట్లు బంధితునిగా జేయునో చూచెదనుగాక.

యశోద—(త్రాళ్ళు తెచ్చి కట్టగా కొంతతక్కువ యగును.) ఔరా! యిదేమి ఆశ్చర్యము. యింటగల త్రాళ్ళన్నియు దెచ్చితినే! యేమియు సార్థకము లేకపోయెనుగదా!

ఉ. రజ్జువు లెల్లగూర్చి యొక త్రాటిగ లంకెలు వేసి త్రిప్పినన్
బొజ్జకు జుట్టిరాదకట! పుత్రుమహాత్మ్య మదెట్టిదో కదా!
అజ్జలజాతుడో శివుడొ ఆ పరమేష్ఠియొ ఆ మహేంద్రుడో
ఇజ్జగమేల బుట్టెనని యెంచెద మానవుడింత యొప్పునే.

ఏమిసేయుదు వీని నెట్లు గట్టుదును.

కృష్ణ—(తనలో) మాతల్లి నన్ను గట్టజాలక మిక్కిలి శ్రమనందు చున్నది కావున దయదలంచి కట్టబడెదనుగాక. (ప్రకాశముగ) అమ్మా! యీసారి త్రాడు త్రిప్పిచూడుమా నిముషములో గట్టగలుగుదువు.

యశో—ఔరా! నిన్ను గట్టనెంచు నాకే యుపాయము జెప్పుచుంటివా? (తిరిగి కట్టను సరిపోవును.) మంచిది చిన్నికృష్ణా! నీ బొజ్జకు గట్టిన త్రాటి నీ రోటికి గట్టివైచెదను. ఇక నెక్కడికి బోయెదవో చూచెదనుగాక. పడియుండుము (అట్లు చేసి వెడలి పోవును.)

కృష్ణ—ఆహా! మాతల్లికి నన్ను జూచిన నంతలో భగవద్భ్రాంతియు నంతలో పుత్రభ్రాంతియు నిదియంతయు నా మహాత్మ్యమే కదా! యీరోలీడ్చుకొనిపోయి యీ మద్దిచెట్ల సందున నిరికించి చెట్లను గూల్చెదనుగాక. (అట్లు చేయగా మద్దిచెట్లు ధ్వనితో గూలును. నలకూబరమణిగ్రీవులు ప్రవేశించెదరు.)

నలకూబ—(అంజలితో) జయతుశ్రీ యదుకుల పయోధిచంద్ర! అభివందనము లంగీకరింపుడు.

గీ. సకల కల్యాణగుణుడ ! కృ ష్ణభగవంత !
బాలుడవె నీవు జగములకు మూలమీవు
నీ విలాసంబె యగుగదా నిఖిలజంతు
సంచయం బెల్ల విశ్వేశ సారసాక్ష.

మణిగ్రీ—దేవా ! జగద్రక్షక ! మాంపాహి.

గీ. సురలు ప్రార్థింపగా నీ యశోదగర్భ
మందు జన్మించితివి రాక్ష సాళిద్రుంప
మనుజమాత్రుడవే ! మద్ది మాత్రులైన
మా మహత్తర శాపంబు మాన్పినావు.

నలకూ—దేవాదిదేవా ! శ్రీకృష్ణపరమాత్మ!

గీ. నిన్ను నజ్ఞానులగువారు చిన్నికృష్ణు
డంచు దలతురు కాని మహాత్తునీవె
నీ విలాసంబులెల్ల ము నిప్రవరుల
కోర్కె దీర్చుటగాదె ! గోకుల శశాంక.

స్వామీ ! నీ చరణకమలధూళీ లవంబుచేత నారదుని శాపమువలన మద్దిమాత్రులమై పడియున్న మేము విముక్తిగాంచి స్వస్వరూపములను దాల్చినాము. నేను నలకూబరుడను యీతడు మణిగ్రీవుడు కుబేరసఖులము. మీ యనుపమానపద భక్తిసామ్రాజ్య మొసంగెద లేని తరించెదము.

కృష్ణ—ఓ కుబేరసఖులార ! మంచిది అట్లే నాభక్తి నొసంగితిని. మీరిక మీ నెలవులకు బొండు.

నల—మహాప్రసాదము. (నమస్కరించి చెదరు.)

యశోద—(ఆతురతతో ప్రవేశించి) హా నా చిన్నికృష్ణా !

గీ. అక్కటా ! కట్టితిని రోటి ౹ కంటదీసి
మద్దు లెటుగూలె నీమీద ౹ ముద్దులయ్య
బ్రతికియుంటివా ! లేదా నా ౹ భాగ్యమోటుల
నున్నదో తెల్పరే మీకు ౹ బున్నెముండు.

(వెతకిచూచి కృష్ణునెత్తికొని) హా నా చిన్నికృష్ణ ! నా ప్రాణధనమ ! నాయనా ! బ్రతికియుంటివా ! నీ కెక్కడను దెబ్బ తగులలేదు కద !

కృష్ణు—అమ్మా నాకేమియు దెబ్బ తగలలేదు వగవకుము.

నందుడు—(ప్రవేశించి) నాయన ! నే నెంత యదృష్టవంతుడనురా !

గీ. ఘోరమని ధాత్రిగూలిన ౹ భూరుహముల
సందునను చెక్కుచెదరక ౹ సౌఖ్యగతిని
జీవములతోడ నుంటివే ! ౹ చిన్నికృష్ణ !
రహిని నాపుణ్య మేమందు ౹ రా కుమారా.

యశోద—బిడ్డా ! అలసియుంటివా. (చేలముచే విసరుచు)

గీ. నన్ను గన్నతండ్రి ! నా ౹ చిన్నికృష్ణయ్య
నల్లనయ్య ! నామ ౹ నఃఫలంబ
కఠినమతిని నిన్ను ౹ గట్టితిరా బిడ్డ
పాపి నాదుబుద్ధి ౹ పాడుగాను.

నందు—దేవీ ! భగవంతుడు మన బిడ్డను మన కొసంగినాడు. వీనికి దృష్టి పరిహారములు సేయుదము రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)



# శ్రీ సంగీత కృష్ణలీల.

## షష్ఠాంకము.

రంగము:—బృందావనము.

[బలరామకృష్ణులు గోవిందానాములు ప్రవేశించెదరు.]

బల—తమ్ముడా! శ్రీకృష్ణా! ఈ బృందావనము మిప్పుల నివాస యోగ్యమైనది సుమి?

ఉ. భూరి తృణోత్కరంబులును ǁ పొల్పగుసాంద్ర నికుంజసీమలున్
సార జలప్రవాహములు ǁ స్వాదు ఫలప్రద కాననంబులున్
గోరికలిచ్చి ప్రోచు సుర ǁ గోవువిధంబున నీ వనంబు సొం
పారుచు మన్నివాసమున ǁ కర్హముగా విలసిల్లె దమ్ముడా.

కృష్ణ—అన్నయ్యా! నీ వన్నట్లీ వనము కడుసౌఖ్యదాయక మైనదియే.

చ. అల యమునా నదీజలము ǁ నాదలి తుంపురులన్ గ్రహించి యా
మలయసమీరు డాటల శ్ర ǁ మాబుచు పోవగజేసి సౌఖ్యమున్
గలుగగజేయు గోవులు సు ǁ ఖంబుగ మేయ దృణోత్కరంబుచే
నలరె గొఱాత సుతకల ǁ దా! మఱి యిందు వసించువారికిన్.

ఆనందా! నీవు పోయి గోవులను దూర మేగకుండ నీ సమీపముననే నిలిపి రమ్ము.

అనం—చిత్తము. (నిష్క్రమించి మరల వచ్చును.)

కృష్ణు—గోపాలకులార !

సీ. వేణువు లూదరే । వీనుల విందుగా
నటనంబు సేయరే । చటుల గతిని
ఏక కంఠముతోడ । నేకలు వేయరే
అడరి దాగుడుమూత । లాడరారె
చెడుగుడు లాడరే । వడిగూత లిడుచును
దొంగాట లాడరే । తోరముగను
గొంగళుల్ గప్పిద । గోవులై నడువరే
చెంగున నెగురరే । చిన్నలార !

గీ. ఎండు మ్రోడులు చిగురింప । దండిగాను
గీతములు పాడరాదె సం । ప్రీతితోడ
నన్ని యాటలలోన నా । యకుడ నేను
మీరు సహకారులై యుండ । రారె ! వేగ.

గోవిం—కృష్ణా ! నీ వేయాట చెప్పిన నాయాటనే యాడుదము.

కృష్ణు—మంచిది. కొంచెము సేపు తాళుడు. నే నొక చిత్రమైన యాట
నాడెదను. (మాయా గోవత్సమును బట్టుకొని)

క. చెలులార ! దీని వేగను
తిలకింపరె ! యాటలందు । దెలివి కలదియా
జెలగాట మాడవలె సాం
పలరారగ దీనితోడ । నతిముదమొప్పన్.

(ఆ దూడను నెత్తి భూమినిగొట్ట రాక్షసుడై వచ్చును.)

అందరు—(ఆశ్చర్య మభినయింతురు.)

బలరా—తమ్ముడా ! నేను నిక్కముగ గోవత్సమును జంపుచున్నాడే

ఖిరా యని పాపభీతికి జడిసితి. ఔరా! మాయా రాక్షసు డెంతమోసము జేసెను.

కృష్ణు—అన్నయ్యా! వీడు వత్సాసురుడు సుమీ.

గోపికులు—జై మా గోపాలకృష్ణమూర్తికి జై జై జై. (రాక్షసు నీడ్చును.)

కృష్ణు—మిత్రులార! మీ కింకను గొన్ని విచిత్రముల జూపించెదను. మఱికొంత దూరము నడువుడు.

అందరు—(అట్లు నడతురు. లేక రంగము మూరవచ్చును.)

బలరా—          పాట. ఆనందభైరవి రాగము—ఏకతాళము.

1. తమ్ముడ! యీ వనములకేగి । తరువుల నెక్కెద మికరారా యిమ్ముగ బూచిన పూలతికలగొని । యొంతయు నుయ్యేలలూగుదమా । సంతస మొప్పగ బాడుదమా ।

కృష్ణు—

2. అన్నా పొన్నలగున్నలివే । చెన్నుగ నెక్కుచు జెలగుదమే । పన్నుగ బాడుచు యమునసైకతపు । దిన్నెల మొగ్గల వేయుదమే । గ్రిన్నన నుప్పటు లాడుదమే॥

బలరా—

3. ఆ రక్కసునటు బరిమార్చి । అలసినావు తమ్ముడ వినుమా । సారముగల యా నీరముగ్రోలి మీ । కారుల జేసి సుఖంపదుమా । చేరి గోపకులు సేవించు ॥

[బకాసురుడు కొంగయై ప్రవేశించును.]

కృష్ణు—

4. చెంగటజూచిరె యున్నతమా । కొంగను భీతిని గొల్పునదే । భంగము జేసెదునని యెంచెద ని । స్సంగుడుమునీంద్రుని సరణినదే । కొంత తపంబొనరించునదే ॥

గోవిం—అబ్బబ్బా! ఎంతకొంగయో! ఊరకే మ్రింగులాగుననున్నదే.
ఆహా జపము సేయుచున్నట్లున్నది.

కృష్ణు—గోవిందా! యిది మహామునుల మించినది సుమీ. (బకముకు సమీపింపగా కృష్ణుని మ్రింగివేయును.)

బలరా—హా తమ్ముడ! కృష్ణ! యింకేమిగతిరా.

గోవిం—బలరామ! ఎందుల కింత యధైర్యపడియెదవు. పూతన్బ్రాయముననే నేక రాక్షసుల జంపిన కృష్ణుడు కొంగను బరిమార్ప జాలడా కావున దుఃఖింపకుము.

బల—గోవిందా!

గీ. చూచుచుండగ నీ బకా సురుని నోట
జిక్కెనడా దమ్ముడిక నేను సేయువాడ
జెక్కుదనుజుల జంపిన నుక్కులునకు
నిట్టిగతి కల్గెనన దుఃఖ మేల రాదు.

కృష్ణు—(బకుని గర్భము జించి వెడలివచ్చును.)

బలరా—హా తమ్ముడా! కృష్ణా! మరల నాకంటబడితివోయి. నిక్కముగ నీ బకము నిన్ను మ్రింగెననియే యెంచితిని సుమీ.

కృష్ణు—అన్నా దానిని జంపుటకొరకు దానినోట బడినాను. ఇదియే కాదు యింకను చిత్రములున్నవని చెప్పినాను. ముందునకు నడువుడు.

అందరు—(అట్లు నడతురు.)

అఘాసురుడు—(ప్రవేశించి) ఔరా! నాదనందనుడట శ్రీకృష్ణుడట! బాలప్రాయమువాడట! మా కంసమహారాజుచే బంపబడిన శకటాసుర తృణావర్త వత్సాసుర బకాసుర ధేనుకాసురాదుల బరిమార్చినాడట. ఆహా! ఎంతవింత! ఈ అఘాసురుని మ్రోల నీ కృష్ణుడు యమునిసన్నిధి. కరుగకుండునా? (ముందు

జూచి) అమగో! కొందరు గోపాలకు లాకర్షించ నడచుచున్నారు. ఆనల్లనివాడె కాబోలు గృష్ణుడు. నేనొక గొండచిలువనై గోపాలకులతో గూడ నీ కృష్ణుని మ్రింగివేసి మాకంస మహారాజునకు బ్రీతి జేసెదను గాక. (నిష్క్రమించును.)

(గోపాలకులందరు నిష్క్రమించెదరు.)

కృష్ణు—అక్కటా! ఎంతప్రమాదము జరిగెను. మా గోపగణంబు లీ మహాసర్పము నోటబడినవే సరే! అగుగాక నే నీ సర్పమును జీల్చి వీరల రక్షించెదను గాక. (నిష్క్రమించును.)



2 రంగము—వనాంతరము.

బ్రహ్మ—[ప్రవేశించి] దేవకీదేవి గర్భమున నారాయణు డుదయించి కంసుని వధించునని విని యానాడు గర్భస్థుని బ్రార్థించితిని. కాని యప్పుడు ఆమె యష్టమగర్భమున బాలిక యొకర్తు జనించెననియు దానినే కంసుడు వధింప నెంచ నాబాల గగనమున కెగిరి మహాశక్తియై నిన్ను జంప నాసరసనుబుట్టిన బాలు డొక్కడున్నాడని చెప్పినదట. అందుచేత బాలుల నెల్ల జంపుడని పూతన కాజ్ఞనీయ నందయశోదలకు బుట్టిన కృష్ణుని జంప బోయి పూతనయే మరణించె. నక్కారణంబున గంస ప్రేరణమున తృణావర్తాది రాక్షసులు కృష్ణుని జంపవచ్చి తామే మడసినారట. ఆకారణమునం జేసి కృష్ణుడే నారాయణుడని తలంచెద నయినను గోగోపాలక వర్గమును నేనొక కొండగుహలో డాచియుంచి యీకృష్ణుని మహిమమేదో కనుగొందును గాక. ఆహా! పరమేష్ఠినైన నాకు గూడ విష్ణుమాయ తెలియకున్నది కదా! కావున నట్లుచేసి శ్రీకృష్ణతత్వము నరసెదను గాక.

(నిష్క్రమించును.)

కృష్ణుడు—(ప్రవేశించి) ఆహా! ఏమిది! నాశిశువులు గోపాలకులు గూడ గానరాకున్నవారే! (ఆలోచించి) ఓహోహో తెలిసినది.

గీ. నను బరీక్ష సేయ నలినసంభవు డెంత
వాడు ; గోపకులను పశుగణంబు
దస్కరించి డాచె దద్రూపముల నెల్ల
నేనదాల్చి బ్రహ్మ నే హసింతు.

గోవునై పాలిచ్చెదను. వత్సనై పాలు త్రాగెదను. గోపకుడనై కాయుదును. ఆయా గోపసతులకు బిడ్డలనై వారి భార్యలకు భర్తలనై యెల్లరునేనయై ప్రవర్తించెద గాక. అపుడు బ్రహ్మ సిగ్గుపడి నన్ను శరణుజొచ్చును. (నిష్క్రమించును.)

8 రంగము.

[కాళింగుని పడగలపై కృష్ణుడును ప్రక్కన నాగకాంతలు ప్రవేశించెదరు.]

కృష్ణుడు—ఈకాళీయపన్నగ విషపూరితమైన జలముల ద్రాగి నాగోగోపసంఘంబులు మూర్ఛిల్లినారు. కావున నీ కాళీయుని మదమడంచెదను. ఓరీ విషసర్పరాజా!

లయగ్రాహి.

పన్నగ కులాధమ సుఖోన్నతి జలంబులను
గ్రన్నన ద్వదీయ విష సన్నిభము సేయన్
జన్నె ; యల గోపకుల మున్నరికమొప్ప స్మృతి:
సున్నగ నొనర్చితివి మన్నితుడవగుదే
నన్నెరుగగా ఫణము లన్నలగ ద్రొక్కెద మ
దోన్నతినడంచెదను తిన్నగ వసింపన్
జెన్నటి ; తలల్ జిమక దన్నెదయమాంతికము
నిన్నువడిజేర్చెద వి పన్నులను గాతున్.

కాళీయుడు——(మడుగులోనుండి) హా దేవ దేవ! నారాయణ! శ్రీకృష్ణ భగవంత! శరణు శరణు. మాంపాహి, మాంపాహి.

నాగకాంతలు——దేవా! గోపాలకృష్ణ! యీచరాచరజంతు సంతానం బెల్ల నీ మాయావిలాసముకదా! నీచే సృష్టింపంబడిన బిడ్డలము క్రూరులము మహాపాపులము రక్షించి మాకు బతిభిక్ష పెట్టుము. తండ్రీ! జగన్నాథ!

కృష్ణు——ఓ నాగకాంతలార! మీకు బతిభిక్ష నొసంగితిని. కాళీయుడా నీవిచ్చోటు విడచి సబాంధకముగ సముద్రమధ్యమున బ్రవేశించుము. నా పద చిహ్నంబులు నీ ఫణముల నుండుటంజేసి నీకు శత్రువైన గరుడుండు నీచెంతకు రాకుండును. అనుగ్రహింపబడితిరి పొండు.

కాళి——మహాప్రసాదము.

(తెర పడును.)



4 రంగము——వనాంతరము.

[బలరాముడు యశోద చేయిఁబట్టుకొని ప్రవేశించును.]

యశోద——హా నాముద్దుల తండ్రీ! శ్రీకృష్ణ!

శా. నీలాంబోధర దేహ! యేమిగతి తండ్రీ! యెట్లున్నాడవో
గాళిందీనది కేల పోయితివిరా! కాళీయ క్రూరోరగా
భీలోద్వేల విషాగ్ని కీలలకునై భీతిల్లితో సాక్షి ప్రా
ణాల్ కోల్పడినావొ యేమయితివో నాముద్దుకృష్ణా! హరీ!

[తెరలో]

ఉ. కొందలమందకమ్మ! (కృష్ణుడు వచ్చి తల్లిని గౌగలించి)
యల క్రూరఫణీ విషవహ్ని కీలలన్
క్రిందగ లేదు కాళియుడు క్రీ రతము బాదహతిన్ హరించి మా

మొదలు సంచరించు వన ॥ మార్గము వీడి సబాంధకంబుగా
బొందుగ వార్ధి మధ్యగల ॥ భూమివసింపుదుమటంచు బంపితిగా.

బలరా—తమ్ముడా! అట్టిదేశద్రోహిని జంపక యేలవిడచితివి.

కృష్ణ—శరణనుటచే.

యశోద—బిడ్డా! యేదియెట్లులైనను నీవుబ్రతికితివి నాకదియేపది వేలు.
(తెరలో) హా! శ్రీకృష్ణ! మహానుభావ! గోగోపగోపికా గణంబుభయంక రమైనదావాగ్ని మధ్యమునబడి తల్లడిల్లుచున్నారు. నీవువేగవచ్చి దావాగ్నినిజల్లార్చి వీరల నీభక్తుల సంరక్షింపుము. (తెరలో దావాగ్నిబ్రజ్వరిల్లును)

కృష్ణ—అమ్మా నీవును బలరాముడును యింటేయుండుడు. నేనుపోయి యామండుచున్న దావాగ్నినార్పి మనవారలను బశుగణంబును రక్షించెదను. అదిగోచూచితివా! మంట లెక్కెగయుచున్నవో! గోపకులార నేనిదేవచ్చెద భయములేదు.

యశోద—అయ్యో కొడుకా! ఆపెనుమంటల నెట్లార్పెదవోయి!

చం. బెబ్బగమండుమంటలు న ॥ భంబునకంటుచునుండె జేరినన్
దగులువడంగజేయవె సు ॥ తాజలమెచ్చట దెచ్చియార్పగా
దగుకువు తా దృశాగ్నుల న ॥ దండలపోసిన భీతిపుట్టె దే
వగణముసైత మాసిఖల ॥ వాపగలేరటు పోవ బోకు మా.

కృష్ణ—అమ్మా! నేనెట్లైననార్పి వారలరక్షింపవలెను. నీవునాకడ్డు చెప్పకుము. (నిష్క్రమించును.)

యశో—అక్కటా బలరామ! యికేదిదిక్కోయి.

బలరా—అమ్మా జడియకుము. మనకృష్ణుడాదావాగ్నిని మ్రింగివేసి వారలరక్షించి యీదెసకేవచ్చుచున్నాడు.

[తెరలో] జై గోపాలకృష్ణదేవునకు జై జై.

యశోద—హా మ్మయ్యా! యిప్పటికి నా ప్రాణములు బొందిలో జేరినవిరా! బలభద్రా! మనమా గోగోపగోపికాపరివృతుడై సన్నుతులనందు కృష్ణునిచెంతకు బోవుదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమించెదరు.)



5 రంగము—బృందావనము.

[బలరామకృష్ణులు ప్రవేశించెదరు.]

కృష్ణు—అన్నయ్యా బలరామ!

ఉ. చూచితె! యీశరదృతుప్రశోభ విసీల వితానమందునన్
దోచెను మౌక్తికంబులన దోరపుమింటను తారకల్ మహా
రోచులఁగ్రాల వెలింగెడును రోదసినిండెడుపండువెన్నెలల్
లోచనపర్వమై కుముదలోలుడు చంద్రుడు మింటఁ గొప్పెడిన్.

బలరా—తమ్ముడా: ఈశారదచంద్రమండల మెవ్వరికి సంతోషము గొల్పకుండును.

కృష్ణు—అన్నయ్యా! యీచంద్రుడు మాత్రమెల్లరకును సమ్మోదమునే కలిగించుననుకొంటివా! పాంథజనపద్మినీమణులకు సంతాపకారి కాడా?

బల—తమ్ముడా! అది వేరుమాట. జ్వరపీడితునకమృతము చేదైనట్లు విరహులకు శమనుడు కావచ్చును.

కృష్ణు—పోనిమ్మది యట్లుండనిమ్ము. మనమిప్పుడు మురళీగానముచే గొంతసేపు కాలక్షేపము సేయుదమా!

బల—అటులే కానిమ్ము.

కృష్ణు—(మురళిని వాయించును.)

(తెరలో) హా గోపీమనోహరా!

బల—(తనలో) మాతమ్ముడు మురళీగానమారంభించగనే గోపికలు మోహావేశపరవశులై వచ్చుచున్నారు. నేనిటనుండరాదు

(ప్రకాశము) కృష్ణా! ప్రలంబాసురుని వధించిన శ్రమ నన్నింకనూ వాయలేదు. కావున నేను పోయి కొంచెము సేపు పండుకొనెదను.

కృష్ణ — మంచిది అటులే సేయుము.

బల — (నిష్క్రమించును.)

కృష్ణ — మాయన్న నన్ను విడచిపోయినాడు. నామురళీగానమాలకించి గోపికలు విరహార్తులై వచ్చుచున్నారు. నేను వారిమనోభిప్రాయములనరసి కొంతసేపు వారికనులబడకుండ మురళివాయించుచు నాడించెదను. (మురళివాయించును.)

(పల్లవాధరి సారసిక ప్రవేశించెదరు.)

పల్లవా — హా గోపీమనోహరా! గోపాలకృష్ణ!

మ. తరుపుల్లల్లటిలంగ బన్నగములు న్ద్వద్భ్రాంతివల్మీక గ
హ్వరముల్వీడి ఫణంబులెత్తు మను నాహ్లాదంబుగా నాసగా
దరుణీ మేఖలలూడ గంచుకపు బంధమ్ముల్వీడిన్వీడ మో
హరసంబొప్పగ వేణునూదు యదుకృష్ణా! యెందునున్నాడవో.

సారసి — ఓసీ పల్లవాధర! యీప్రాంతమున జెట్లుమిక్కిలిచిగుళ్ళచే నుప్పటచే నిండియున్నాడనితలంచెదను.

పల్ల — సారసిక! నీయూహసరియైనదే కాని పచ్చకర్పూరగము బ్రహ్మాండభాండమున వెల్లెడల వెదజల్లినట్లున్న యీశరత్కాలశర్వరీ సంపూర్ణచంద్రిక యొప్పియుండ మనకా మహానుభావుడు కనుపడకుండుటకేమి హేతువే?

సార — హేతువున కేమియుండును. కృష్ణుడా యింద్రనీలకాంతి రంజిల్లువాడు. ప్రమదావనమా తమాలపత్రభూయిష్టము. అతనియను గ్రహమే రావలయును గాని నిజముగ నతడెదుటనుండినను మనకు గనుల బడువాడుకాడు.

కృష్ణు—(తనలో) నేను వీరల కదృశ్యుడనై తిరిగి మురళీగానమును జేసెదనుగాక. (మురళి వాయించును.)

పల్లవా—అదుగో అదుగో కృష్ణుడు.

సారసి—ఏడీ? యెక్కడ! నెక్కడ?

పల్లవా—ఓసీ నీ చెవులలో జెట్లు మొలచెనా? మురళీగానము వినబడ లేదా ?

సార—సరి సరి. ధూమమువలన నగ్ని యున్నదని తెలిసికొనినట్లే గానమువలన గృష్ణు డిచటనున్నాడని యనుకొనుటయే కాని నిజముగ గన్నుల కఱ్ఱదీర నీ వాతనిని జూడలేవు కద!

పల్లవా—లేదు చూడలేను.

సార—ఆయనకు మనమీద దయ రాలేనట్లే మన మదృష్టహీనులము. అయినను బ్రార్థింతము.

పల్లవా—సారసికా! ఆ వేణు వెంతటి పుణ్యమును జేసినదే!

ఉ. వేణువదెట్టి పుణ్యఫల విస్తృతి గాంచెనొకాని గోపికా
జాణలకింత లేక యను చుమ్మని కృష్ణునిమోవి తేనియల్
రాణ జెలంగ నానుచు నిరంతరమున్ దనివొందుచుండెనో
యేణవిలోచనీ! మన మిట్టుల బ్రాణములన్ భరింతుమే?

సార—ఓ నామాట నిజమే. ఆ మురళి చేసిన పుణ్యము మనకు లభించునా ?

కృష్ణుడు—నే నీ గోపికల కందంద గనిపించుచు నదృశ్యుడనై విరహవేదనల పాలు చేసెదనుగాక.

పల్లవా—(రహస్యముగా) సారసికా (వేలితో జూపుచు)

మ. అదుగో కృష్ణుడు మౌళిబర్హముసమున్ ద్యచ్ఛక్రి చాపంబుగా
న్నడరన్ బిల్లనగ్రోవి గ్రొమ్మెరుగుగా నా నీలమేఘస్థితిన్

గదు దానోక్కచు వేణు యష్టిరవముల్ కి గర్జారవంబట్లు నా
యెద వషింపఁజేగ కృపారసంబు సిటురా కి హా! ప్రార్థనల్ సేయగా.

సార—ఔ నాను. మెల్లగ నకుపుము పారిపోవునేమో.

పల్లవా—సారసికా! నీవు చెప్పిన మాట నిక్కమే. మన మిచ్చటనుండి యే చెవరకుండ మనచూక్కితీవలచే నా గోపాలకృష్ణుని బాధించి తరువాత మెల్లనబోయి బాహులతలచే గట్టి పడవే యుదము.

సార—అదిగో అప్పుడే కృష్ణు డంతర్ధాన మైనాడు.

పల్లవా—అక్కటా! అదృష్టహీనులము కదా! (క్రింద జతికిలబడి) ఓసీ సారసికా!

మ. సకులున్ బిడ్డలు భర్తయున్ గలుగు సం కి సారంబు నిస్సారమా
నుకదా! సర్వజగంబు లేలదగు మా కి న్యాయ డీశు డాకృష్ణ నా
యకుడం చెంచి తదీయపాద కమల కి ధ్యానంబుచే వచ్చి యా
యకలంకాత్ముని సేవ సేయుటకు నా కి హా! నోచకున్నాముగా.

సార—పల్లవాధరి! అనుపమానుభావుడు కృష్ణభగవంతుడు ప్రార్థనల వలనగాని మనకు వశుడు కాడని నేను తొలుతనే చెప్పియుంటిని కదా! భక్తిపురస్సరమైన ప్రార్థన సేయక మన మారాటపడిన మనకాతడు దర్శనంబిచ్చునా! (అత్రిముత్రో) అదిగో అదిగో కృష్ణుడుమరల నావరిక నాకుగనబడినాడు (నడచును.)

పల్లవా—ఏడీఏడీ! యెక్కడ? (తొందరతో నడచును.)

సారసి—అక్కటా! మరల మాయమైనాడమ్మా.

పల్లవా—సరే యిక నీవుచెప్పినటుల నీసికతాతలంబున కృష్ణునారాధింతము. అట్లుకాని మనకాతడు చిక్కడు నీవుపూవులను గోసి కొనిరమ్ము నేనీలోపుగా సైకతీకృష్ణుని నిర్మించెదను.

సార—అట్లేచేసెదను. (పూవులనుదెచ్చును.)

పల్ల—(ఇసుకతో గృష్ణునినిర్మించును.)
సారసి—(పూవులు దెచ్చి) పల్లవాధరీ! పూవులను దెచ్చితిని.
పల్లవా—రమ్ము పూజింతము. ఇదే కృష్ణ ప్రతిమ.
ఇద్దరు—(పూజించి ధ్యానించెదరు.)
పల్లవా—ఓ మహానుభావ! శ్రీకృష్ణ! మాకు నీదివ్యమంగళ సందర్శనం బిమ్ము.

ఉ. నందకుమార! నీదు చరణంబులె మాకిక దిక్కటంచు మా
నందనులన్ సఖీజనుల నాథుల నెల్ల పరిత్యజించి యా
నందముతోడ వచ్చితిమి నంత కృపారస వృష్టిఁ జిల్కి నీ
చందము జూపి బ్రోవగదె! సారసలోచన నీవు భర్తవై.

సార—అక్కటా! పల్లవాధరీ! యీవిరహబాధ నేను సహింపలేకుంటిని కదే.
పల్లవా—ఓసీ! నీకంటె వేయిమడుంగులు విరహతాప మనుభవించు నాతోడనా నీవు చెప్పుకొనునది.

ఉ. కంచుకబంధమా బిగిసె, గ్గురుపాటుజనించె మేన, గీ
లించినగాని, నీవిసడలెఁ, జిరుచెమ్మట లుద్భవిల్లెఁ, జే
లాంచలమెల్ల నానె, నకటా! పుటపాకపు బైడితీవ నా
మించెను మేను వేడిమికిఁ మిక్కిలి తాపము బుట్టె నైతు నే.

సార—అబ్బబ్బా! పల్లవాధరీ! యీశరచ్చంద్రిక నామేనిమీద నిప్పులు చల్లినట్లు చేయుచున్నది. ఆశ్రీకృష్ణుడు సందర్శనంబిచ్చి రక్షించునన్న, నామహాత్మునకు గృపరాలేదు కావున నీ యమునా తరంగిణిలో నుఱుకుదును. లేకున్న నాతాపమారునని తోచదు.
పల్ల—మంచియాలోచన జెప్పితివే.
కృ—(తనలో) వీరిక జలక్రీడ లాడబోయెదరు. నేను వీరివలువల సంగ్రహించి పరిభవించెదనుగాక!
సార—అట్లయినరమ్ము పోవుదము. (అందరునిష్క్రమించెదరు.)

6. రంగము. [గోపికలతోఁ యమునానదియు జీరల సంగ్రహించిన కృష్ణునితోఁ. పొన్న చెట్టున్ను.]

1. గోపిక—(ఆతురతతో) చెలులార! మనచీరల నెవ్వడో తస్కరించె నుకదా! యికేమిగతి.

2. గోపిక—ఓహో మోసముచేసినాడే! యింకెవ్వడట్టి పనిసేయువాడు! కృష్ణుడే!

3. గోపిక—అదుగో! శ్రీకృష్ణుడు చీరల నెత్తికొనిపోయి పొన్న చెట్టుపై నెక్కి కూర్చున్నవాడు.

1. గోపిక—హా! గోపాలకృష్ణ! ఇదేటిపని పయోదధిమెలంగుటా! గోత్రమున ధాత్రిన ధరించుటా! పురుషసింహుండవై జనులను రక్షించుటా! మావలువల మాకిమ్ము. మామానసహరణము నీకు దగదుసుమా!

2. గోపిక—ఓకృష్ణ! పిన్నవాడవైయును పెద్దవాడవై బలినడంచుట యని తలంచితివా! రాజుల సంహరించుట యనుకొంటివా! గురువాక్యమును పాలించుటయని యెంచితివా! ప్రబుద్ధుడనని పించుకొంటకా మావస్త్రముల దస్కరించి మామానముల మానసములను హరించితివి. మావలువల మాకిమ్ము. ఇదినీకు మంచిపనికాదు.

కృష్ణు—ఓగోపికలార!

ఉ. సిగ్గునొలంగి పల్వురు హసింపగ జీరలవిప్పివైచి మై
జగ్గులు వెల్లడించుచును సాహసకై జలకేళిదేలగా
సిగ్గొకయింత లేదో! మదినే పురుషున్ వరియించినారో! యీ
యగ్గలమైన మారవిరహాతిశకింగ్రగనేల చెప్పుడీ.

1. గోపి—ఓకృష్ణా! అన్నిటికి నీవే కారణము. రక్షించి మావలువలిమ్ము.
కృ—జలము వెలువడివచ్చిన మీచీరలిచ్చెదను.

[తెరపడును.]

7 రంగము:—స్థలాంతరము వనము.

[బలరామకృష్ణులు ప్రవేశించెదరు.]

బలరా—తమ్ముడా! శ్రీకృష్ణ! యీ వనంబున ఆంగిరస సత్రయాగ మొనరించు బ్రాహ్మణులను నీవు బ్రాహ్మవాదు లంటివి. వారు నిక్కముగ బ్రాహ్మవిదులే యైన నీ వన్నమును వేమ్మని పంపిన గోపకులతో యజ్ఞ భంగ మగునటుల గొల్లకృష్ణునకు మే మన్నము పెట్టుదమా యని నిరాకరించునా?

కృష్ణ—అన్నయ్యా! వా రజ్ఞానవశంబునం జేసి మన తత్వముల నెఱుంగక అట్లు పల్కి యుందురుగాక. వారి భార్యలు మన వార్త విని మన కిపుడు షడ్రసోపేత భోజనమును గొని తెత్తురు. ఇంచుక సేపు చూతుమా!

[మునిపత్నులు ప్రవేశించెదరు.]

మునిపత్నులు—స్వామీ! కళ్యాణగుణాలంకార! శ్రీకృష్ణ భగవానుడా! మాభర్త లొనరించిన నిరాకరణమునకు మన్నించి మమ్ముల మీ చరణదాసీజనులుగా జేసికొనుము. నీ మహా తత్వము మూఢమతులకు దెలియదు. సచరాచరజగములకు నీవే మూలకారణుడవు. ఆదిమధ్యాంత శూన్యుడవు. అవ్యయుడవు. సంసారాజ్ఞాన మహాదంధకారమున బడి పొరలుచున్న మాకు దివ్యతేజోరాశిని జూపి మమ్ముద్ధరించుము.

కృ—ఓ మునిపత్నులార!

చ. పతులు నిరాకరించినను ॥ ప్రాజ్ఞత నా ఘనతత్వభావ సు
స్థితి భగవత్స్వరూపమని ॥ శేముషి చే దిలకించినారు; నా
యతులితపాద నీరజ స ॥ మాహితభక్తి నెసంగినాడ! మీ
క్రతువులుసాగు, భద్రములు ॥ కల్గును, నన్ను భజింతు రెప్పుడున్.

మునిపత్నులు—మహాత్మా! మహాప్రసాదము. మేము తెచ్చిన భక్ష్య భోజ్యాదుల స్వీకరించి మమ్ము గృతార్థుల జేయుము. (అక్కడ ప్రసాద ముంతురు.)

కృ—మంచిది. మీ రిక పొండు.

మునిపత్నులు—చిత్తము (నిష్క్రమించెదరు.)

కృ—అన్నయ్యా! మన మీ పదార్థముల నారగించుదము రమ్ము.

నందుడు—(ప్రవేశించి) బిడ్డలార! ఇంద్రయాగంబు సేయ సమకట్టి సమస్తవస్తు సామగ్రిని సంపాదించి యుంచితిని. మీరు వచ్చెద రేని యీ పవనంబున కుపక్రమించెదను.

కృ—జనకా! ఇంద్రయాగ మొందులకు? దాని యుపయోగ మేమి?

నందు—కృష్ణా! పర్జన్యునకు నిందుడు ప్రభువగుటచే నింద్రయాగ మును జేసిన నింద్రుడు సంతసించును. ఆతని హర్షముసం జేసి మేఘబృందంబులు వర్షించును. అందుచే సకల సస్యము లును ఫలించి ధాత్రియంతయు దృణభూయిష్ట మగును. అద్దా నం జేసి పశువులును మనమును సుఖముగ బ్రతుకుదుము.

కృ—వెర్రితండ్రీ! నానా జీవకోటులును గర్మమున బుట్టును. కర్మ మున నే యభివృద్ధి నందును. కర్మవలననే జచ్చును. కావున కర్మ పాశమును ద్రెంచుటకై కర్మఫలను గొలువరాదు. ఆ కర్మతం త్రమును దప్పింప బ్రహ్మాదులవశమైన కాదు. కావున నింద్ర యాగంబు మానుడు. మన మిప్పుడు పర్వతంబులకు గోవులకు బ్రాహ్మణులకు యజ్ఞము గావింతము. ఒకవేళ యింద్రునకు గోపము వచ్చునని భయపడెదరేమో? అట్లు భీతిల్లవలసిన పనిలేదు. రండు. మన మా మహీధరమును గుఱించి యజ్ఞము సేయుదము. అందువలన మన యభీష్టములు నెరవేర గలవు.

నంద—(తనలో) నా కుమారుల మాట కేమరాడు తలంపు నాకు లేదు. సకలభార మీశ్వరాధీన మని అట్లే చేసెదముగాక. (ప్రకాశము) వత్సలార! రండు పోవుదము.

(అందరును నిష్క్రమించెదరు.)



8 రంగము:—వనము.

ఇంద్రుడు—(ప్రవేశించి) ఔరా! బలరామకృష్ణుల సాయము జూచి కొని యీనందాదు లెంత క్రొవ్వినారు.

మ. బళిరే! యీబలరామకృష్ణ దురభిక్షప్రాయమ్మునం జేసి గొ
ల్లలు నందాదులు నన్ను జన్మముల దక్కన్ మానిక్రొవ్వెక్కి కొం
డలకున్ యజ్ఞము సేయుచుండెను నిరాతంకంబుగా గాన వి
హ్వలురై వారలు మచ్చమాయశిలలన్ వర్షింతు నే నీయెడన్.

ఆ కృష్ణుండు పెక్కు రక్కసుల వధించినానని గర్వముతో గన్నుగానక యింద్రుడనైన నా మీదనే కత్తి గట్టెనుగా! సరే యీ రాళ్ళవానచే నీ రందర మదంబడంగుగాక. (ఆకసమువంక జూచి) ఓ పుష్కలావర్తక మేఘంబులార! నా యాజ్ఞానువర్తులై మీ రందరు భూ భాగంబు తల్లడిల్లునట్లు రాళ్ళవానను కురియుడు. నే నిదే వచ్చుచున్నాడను.

(నిష్క్రమించును.)

[తెరలో]

హా గోపాలకృష్ణ! యీ పెనురాళ్ళవానచే గోవులమందలును మేమును మడియుచున్నాము. వేగ వచ్చి రక్షించుము రక్షించుము.

కృ—(ప్రవేశించి) ఔరా! ఏమీ యాశ్చర్యము! ఈ రాళ్ళవానకు గారణ మేదియుండును. (ఆలోచించి) ఆ సరే! తెలిసినది. ఇది యింద్రునిగర్వప్రవృత్తి.

చ. శతమఖ! యింద్రియాగపు బ్రశంసను మాన్పి గిరీంద్రిపాళికిన్
గ్రతు వొనరించినామనుచు గర్వముతోడుత రాళ్ళవాన నీ
గతి గురిపించినావె! పలుగా! నిను నీ గరువంబడంతు దు
స్థితిబడియైన గోపకుల శేఖరు తత్వ మెరుంగకుందువే.
నే నిప్పుడేపోయి గోవర్ధనగిరి నెత్తి దానిక్రింద మా గోగోపగణంబుల
నిలిపి రక్షించెదనుగాక. (నిష్క్రమించును.)



9 రంగము:—గోవర్ధననగంబు కొనగోట నిలిపి కృష్ణుడు నిలచును.
కృ—ఓహో గోపాలగణంబులార! జనకా! బాంధవులార! తల్లీ!
గోపికలార!
చ. కురిసెడు రాళ్ళవానకు జుగుప్సనుజెందక యేవిధాననో
శిరమున కడ్డు వెట్టుకొని చెచ్చెర నా కొనగోట నిల్వగా
బరగిన కొండక్రింద నిలువందగు మీకు భయంబులేదు, దు
ర్భరమని యెంచబోక యిటు రాదగు బంధువులార! మందతో.
ఓహో నా చేత నాహూతులైయును ఒక్కరును నాదరికి రాకున్న
వారే! సరే తెలిసినది. యీ కొండను నే నిలుపజాలనని శంకించు
చున్నారు కాబోలును. ఓ మిత్రులార! గోపగణంబులార!
చ. భరమగు కొండయేడ పసిబాలకు డంగుళి నెత్తుటెడ! దు
స్తరము కరంబుకూల జనసంతతి మాయునటంచు భీతిచే
వెఱువగరాదు సర్వపృథిపీస్థలిపై బడుగాక నాదువ్రే
లొరగదు సుంతయేని నిలు డుర్విధరంబున క్రింద నాదరిన్.
[గోవులతో గోపాలకులు నందయశోదలు గోపికలు
భయముతో వచ్చి ప్రవేశింతురు.]
నందు—హామ్మయ్యా! బ్రతికితిమిరా నాయనా!
కృ—పూజ్యులార! మీ కిసుమంతయు భయము లేదు.

10 రంగము:—బృందావనము.

కృ—ఓహో! నే డెంత యానందకరమైన దినము.

మ. అదిరా! యీ శరదిందు చంద్రికల ను ౹ ద్యత్సౌరభోపేత పు
ష్పదళాకల్పిత తల్పమందు మురళీ ౹ వ్యాకీర్ణ సంగీత సం
పద నా హూతలజేసి గోపికలతో ౹ బల్మాను గ్రీడించు వా
నిదె యానంద రమా కుచోపసుఖ సాన్నిధ్యైక జన్మంబగున్.

కావున నే నిపుడు మురళీగాన మారంభించెదను. (మురళివాయించును.)

[పల్లవాధరి సారసిక ప్రవేశించెదరు]

పల్లవా—ఓసీ సారసికా! శ్రీకృష్ణుని యందలి వ్యామోహముచం జేసి నా యలంకారము పూర్తి కాకుండగనే భర్తకు సిద్ధపర బట్టకమునుపే యత్యాతురమున బరువిడి వచ్చుటచే నా కన్నులు పచ్చనై కానరాకున్నవి. ఆ శ్రీకృష్ణు డెందున్నవాడో నీవు చూచి నాకు గూడ జెప్పుమా. ఆ మహాత్ముని చరణసేవ జేసెదను.

సారసి—పల్లవాధరీ! నేను నీకంటె మన్మథజ్వరముచే వేయి మడుంగు లధికముగ బాధ పడుచున్నదాన. నాకు మాత్రము కన్ను లగపడుచున్నవా!

పల్లవా—అబ్బబ్బా! ఎట్లు పలచుదాననే!

ఉ. అక్కట! నాదు మేనపుల ౹ కాంకురపంక్తి జనించె నీవియా
గ్రక్కున వీడె జెమ్మటలు ౹ క్రమ్మెను కన్నులు పచ్చనయ్యె మై
సొక్కెను వేడిచేతను యశోద ౹ సుతున్ గనినా యవస్థ న
మ్మక్కరో చెప్పుమమ్మ విర ౹ హాగ్నికి నో రువజాల సుంతయున్.

నేను నడువజాలకున్నాను. నీ వీ పుణ్యము గట్టుకొనుము.

సారసి—సరి సరి! నీ పెండ్లిమాట నటుంచి నా పెండ్లికి నీవు బాకా పాడుమన్నట్లున్నది. ఈ మాట నే నెవరితో జెప్పుకొందునే!

అంతవరకు నడువలేనిదాన వింతవరకు నీ యర్ధరాత్రిమున నిన్నెవరు తోడి తెచ్చినారు?

పల్ల—నన్ను మన్మథు డింతవరకును దోడి తెచ్చినాడు.

సార—ఆతడే నిన్ను గృష్ణునియొద్దకు గొంపోవును.

పల్ల—ఓసీ అట్లు కాదు.

సార—అట్లూ లేవు. బొబ్బట్లూ లేవు. కాని నీ మగనికి దెలిస్తే చెంప పెట్లు ప్రాప్తించును.

పల్ల—నీ మగనికి దెలిసిన నీకుమాత్రము కోల సంబరము సేయక పువ్వులతో బూజించు ననుకొంటివా! ఏమి.

సార—మూరుపుంతకు ద్రొక్కిన తరువాత మహామోహము కొంత వఱ కుపశమిల్లినదా?

పల్లవా—ఓసీ యొంత గడుసువానవే. నీవు చెప్పినట్లు కన్నుల పచ్చదన మిప్పుడు తగ్గినది.

సార—అట్లయిన శ్రీకృష్ణు డెందున్నాడో యీ పూపుంబొదల నడుగుదము రమ్ము.

పల్లవా—చక్కని యుపాయము జెప్పితివే సారసికా!

చ. కళలకు దావలంబగు మొ గంబుగలా డల యింద్రనీల కం
దళ రుచిమించు మేనుగల తామరసాక్షుడు మాళిభాగమం
దల రెంపు బర్హిపింఛమును హస్తమునందున వేణునాదమున్
గలిగిన కృష్ణు నెయ్యెడల గాంచిరో! వల్లికలార చెప్పరే.

సార—పల్లవాధరి! యీవల్లిక లెల్ల నా శ్రీకృష్ణుని మురళీగాన సుధారసముచే ననలెత్తినవే! యివి మన కాకృష్ణుని జాడ జెప్పునా.

పల్ల—ఔను నిజమే. ఓ వనదేవతలార! పంచభూతములార!

సీ. ఒకనవ్వునవ్వి గో ఽ పికల కన్దోగలకు
విపుల వికాసఁ గ ఽ ల్పించువాఁడు
అరమోడ్పు కనుదోయి ఽ బరపి వ్రజాంగనా
నీవుల సడలించు ఽ నేర్పువాఁడు
మురళిని వాయించి ఽ ముదితల నెల్లర
మోహాంబురాశిలో ఽ ముంచువాఁడు
ఒకమారు పాడసూపి ఽ సకలజనులకు బ్ర
హ్మానంద మొనరించు ఽ నధికతముఁడు
గీ. వేలుపులకెల్ల వేలుపై ఽ వెలయువాఁడు
వ్రేతల మనోధనము దస్క ఽ రించువాఁడు
ఘననగం బెత్తి గోగోప ఽ గణముఁగాచు
సర్వరక్షకు కృష్ణుని ఽ జూడఁగనరే.

కృష్ణు.—(తనలో) ఇంకొకసారి మురళిమ్రోగించి వీరల వ్యామోహి తలఁగా జేసెదనుగాక. (మురళివాయించును.)

సార.—అనుచో కృష్ణుఁడు మరల మురళీగాన మారంభించి కర్ణరసాయనమును జేయుచున్నాఁడు.

పల్లవా.—ఏడీ ఏడీ! యెందున్నవాఁడు.

సార.—కృష్ణుఁడు కనుపడుటలేదు. కాని మురళీగానము వినవచ్చినది. ఆగానమున కానందించుచు గోవులెట్లు చెవులు నిక్కపొడుచుచు కొని తోకలెత్తిపట్టి వచ్చుచున్నవో చూడుమా!

(అపుడు గోవులు వచ్చి చేరును.)

పల్లవా.—ఆహా సారసికా! యీగోవు లెంతటి పుణ్యమును జేసినవే.

చ. అనుపమ ప్రేమ బచ్చిక బ ఽ యళ్లను మేపుచు పై నిమిర్చి యా
మునవిమలాంబుపూరమును ఽ బొల్పుగ ద్రావగజేసి వేణు ని

స్వనమున మోదమును గొలిపి ఏ పాలనసేయును కృష్ణుడెప్డు గో
గణమును గాన గోపకుల ఏ కాంతలు గోవులెయైన మేలగుగ.

సార—నేనును వేణుల తలలో నొకదానినై పుట్టిన మురళినై యా శ్రీకృష్ణుని యధరామృతమును సర్వదా గ్రోలుచు సుఖింతును కదా యని పుట్టెడాస పెట్టుకొంటిని. ఏమిచేయుదును. కోరికలు హెచ్చు. కొనసాగుట లొచ్చు.

పల్ల—అబ్బబ్బా నీవేమో పరిహాసములాడెదవు కాని నాకేమియు దోచుటలేదు. ఒక్కసారి యీగోవులనైన వేడుకొందము రావే.

సార—గోవులే కృష్ణుడు. కృష్ణుడే గోవులు.

పల్ల—ఓసీ వెఱ్ఱిదానా! ఒక్క గోవులే కృష్ణుడను మాటయేమి. కృష్ణుడు లేని ప్రదేశమేది. నానా జీవకోటులలోను నానా స్థలంబులను కృష్ణుడున్నాడు. ఆమహాత్ముడు లేని చోటులేదు.

సార—ఔను అన్నియు నిందున్నవి. అల్లునినోట వినియున్నట్లు కృష్ణుడు సర్వత్రా యున్నవాడు. మనకు మాత్రము కనుపడుట లేదు.

పల్ల—ఎట్లు కనుపడునే మన మభాగ్యార్జనమును కన్నులకు బెట్టుకొన్నాము.

సార—కారణముండక పోదుసుమీ!

పల్ల—(స్మృతినభినయించి) ఆఁ అవును కారణమిప్పుడు నాకు స్ఫురించినది. యేమందువా!

ఉ. మొన్నటి రేయి గృష్ణుని బ్రి ఏ మోద మెలర్పగ. బాహువల్లులన్
గ్రిన్నన బిగ్గగాగిలిడి ఏ కమ్మనివాతెర తేనెలాని యిం
కెన్నడు నీదుమాయ బడి ఏ యీగతి పోలను జుమ్మి! యంచు గ
ర్వోన్నతి బల్కియుంటి నది ఏ యాతగ నన్నిటుజేసె నచ్చెలీ.

సార—ఓహో! అలాగునా! మొన్నటిరేయి యంత్రివే యంతరాత్రి వేళ?

పల్ల—రాత్రి జాముస్నర యైనది.

సార—ఆరాత్రి తెల్లవారువరకు నీచెంత నుండెనా!

పల్ల—ఆ.

సార—అదేమి అసత్యము లాడెదవు. అది యొకగొప్ప యనుకొంటివా!

పల్ల—అదేమే అట్లుబొంకెదవు.

సార—ఆరాత్రి యెల్ల నాచెంతనుండ నీవట్లుపల్కిన నెట్లునిజమగును.

పల్ల—ఓసీ నీవన్నట్లు కమలినియు నిట్లే పలికినది. అట్లయిన నందరి యిండ్లలోను అన్నిరూపముల ధరించి శ్రీకృష్ణుం డందరిని సంతోష పరచుచున్నవాడు.

సార—అదియేమో నాకు దెలియదు. నాయింటనే యున్నాడని నేను తలంచుచుంటిని.

పల్ల—కాదుకాదు. కేవల భగవంతుండగుటచే విశ్వరూపుడై అట్లు ప్రవర్తించుచున్నాడు. స్వామీ మహానుభావ! శ్రీకృష్ణ!

శా. కామక్రోధ ముఖారిషట్కముచు పీకన్ దోలి వింధ్యాటవీ
భూమిన్ హారముమాని భీకర తపంబున్ జేయు మౌనీంద్రులే
నీ మాయన్ దెలియంగ జాలరుగదా! నీరేజనేత్రా! యికన్
మేమా! స్త్రీలము జ్ఞానహీనలము స్వామీ! నిన్ను దర్శింపగా.
కావున మాయెడ గరుణారసంబు జిల్కి మమ్ముద్ధరించుము. మాగర్వ భంజన మైనది.

సార—స్వామీ! జగద్రక్షక! నీమీదభక్తిచే నీదర్శనముకోరి యలమట బడుచు మాకన్నులలోనే రాత్రి యెల్ల హాస్యము జేసి కొంటిమి. అప్పుడే అరుణోదయ మగుచున్నది. వేగ మాకు సందర్శనం బిచ్చి రక్షింపుము.

కృష్ణ—(ప్రత్యక్షమై) నెలతలార ! నే నిందే యుంటినికదా. నన్ను మీరేల గాంచలేక పోయినారు.

కల్ల—మహానుభావ శ్రీకృష్ణ! మీకివేపదివేల వందనములు. మామర ద్దృష్టను మన్నించ చేసినది. ఇప్పటికి కృతార్థులమైతిమి.

[తెరలో]

ఓగోపికలార ! మాధవు డెందున్నవాడు.

కృష్ణ—నెలతలార ! అల్లదే అక్రూరుడు కాబోలు నిటువచ్చుచున్నాడు. నేనిందున్నానని తెల్పుడు.

సార—అయ్యా ! యీరసాలవృక్షము చెంతనున్నా డిటురమ్ము.

కల్ల—(తనలో) అకటా ! మనకీ విఘ్నకారకుడు దాపరించెను కదా !

అక్రూరుడు—(ప్రవేశించి) (తనలో) ఆహా కృష్ణుని సందర్శనమును జేయించి కంసుడు నాకు మేలు చేసినాడు (ప్రకాశముగ) మహాత్మా ! శ్రీకృష్ణ ! అభివందనము సేయుచున్నాడను.

కృష్ణ—అక్రూర ! నీకు భద్రంబులు కలుగుగాక. యెందుండి వచ్చుచున్నావు. నీకును నీవారలకును సేమమా ?

అక్రూర—స్వామీ ! మీకరుణచే నందరు సుఖముగనే యున్నవారు

కృష్ణ—అక్రూర ! పూజ్యులైన దేవకీ వసుదేవులకు సేమమా ! మామామ కంసుడు సుఖమై యున్నవాడా ?

అక్రూ—యదుతిలక ! కుమారు నెప్పుడు కాంతుమని తపించుచు గారాగారమున గన్నుల బ్రాణము లుంచుకొని యున్నవారు. మఱియును,

మ॥ అనఘా తానెనరింప నోచిన ధను ర్యాగంబు జూడంగ మిమ్మును దోడ్తెమ్మని కంసుడంపె నను మీ బుద్ధి విచారింప నా మనమెట్లుండునో ! నేరకుందువె ? మహా త్మా ! సర్వలోకైక రక్షణతత్వంబగు బ్రహ్మవీవెకద ! నన్ గాంక్షించుచున్నా సత్కృపన్.

కృ—అక్రూర! నీహృదయము నాకుదెలియదా! అయినను మాతు
లుడు మమ్ముహతుల జేయునో లేదో యనియే తలంచుచు
న్నాము. అవశ్యము వచ్చెదము సందియములేదు.

పల్ల—మనోహర! యీరాయబారిపే రక్రూరుడా!

కృష్ణ—అవును.

పల్ల—ఆహా! ఏమి ఆశ్చర్యము! శ్రీకృష్ణ!

మ. అకటా మీ కరదైన కంసునకు మిమ్మర్పించి చంపింప నూ
హాకలా డీకుటిలాత్ము డీ శతుసు తా నక్రూరు డెట్లయ్యెనో
యకళంకోజ్వల గోకులా భరణకృష్ణా గోముఖ వ్యాఘ్ర నా
యకుడంచు న్వచియు పరాదె యితడన్ వ్యాహారదుర్వృత్తి చేన్.

కృష్ణ—పల్లవాధరీ! నీవీసత్స్వభావుని గుణంబెఱుంగక అట్లు పలుకుచు
న్నావు. నీవిక నాపశంస దలంపకుము.

సార—దేవా! మీచరణారవింద సేవాభాగ్యమును విడచి మేము
క్షణత్రుటి కాలమైన నిల్వజాలము కదా!

పల్లవా—యదుకుంజర!

ఉ. మాపటివేళ నెల్ల వన మార్గమునందున రోసి రోసి మీ
రూపముగాన లేక శశి రోచులనూడి కృశించిపోయి మె
ట్లోపరికించినాము విధి మోర్వక యింతనె యంతరాయమున్
దాపె నికెట్టులోర్తు గుణ ధామ! త్వదీయ వియోగతాపమున్.

కావున నీవు మమ్ముల విడువక యిందేయుండుము. ఆకంసుండు మీకు
మాతులుడే కాని నిన్ను జంపింప నశేక ప్రయత్నముల జేసిన వాడు.
అట్టి శత్రువునింటికి బోరాదు.

కృష్ణ—గోపికలార యింతటితో మాకిరువురకును శత్రుత్వము చల్లార
గలదు. మీరిండ్లకు బొండు. అక్రూరుడా మాయన్నను దోడు
కొని రథారూఢులమై మధురకు బోవుదము రమ్ము.

అక్రూరు—చిత్తము. (అందరు నిష్క్రమింతురు)





# శ్రీ సంగీత కృష్ణలీల.

## సప్తమాంకము.

### 1 రంగము :—యమునానది.

అక్రూరుడు—(యమునానది నుండి లేచి) ఆహా! ఇదేమి ఆశ్చర్యము

ఉ. ఆ యరదంబు నందుగల । యా బలరాముడు కృష్ణమూర్త్తియు
న్నీ యమునాజలంబులకు । నెప్పుడు వచ్చెను (పైకిజూచి) దోచె నీనదిన్
ఆ యదువంశ శేఖరుల । హా రథమందున గూడ నుండెనా
హా యిట నందునుంగనుల । కల్లన దోచె నిదేమిచిత్రమో.

ఇంకను సందియమేల! బలరామ కృష్ణులు దుష్టసంహారమునకై యవతరించిన భగవదంశ సంభూతులు సందియము లేదు. (తెరవైపునకు దోసిలియొగ్గి) ఓ పరమేశ్వర స్వరూపులార! బలరామకృష్ణులార!

చం. జలము సమీరమున్ శిఖులు । సత్పథమున్ బృథివీ స్థలంబులున్
వలనుగ సర్వజీవులు ధృ । వంబుగ నీదగు దివ్యరూప స
త్కళలగుగాదె హర్త్తవును । కర్త్తవుపోషణ కర్త్తవీవెయో
జలజదళాక్ష! మీయుభయ శాశ్వతతత్వ మొకండెకాదొకో.

దేవా! కారణార్థంబునం జేసి బలరామ కృష్ణనామములతో నవతరించిన ఆదినారాయణుండవు నాయందనుగ్రహించి నీయథార్థ తత్వసందర్శనము సంగినాడవు. పురుషోత్తమ! నీకివే యనేక వందన శతంబు లొనరించినాను. (చేతులుసాచి నమస్కరించి నిష్క్రమించును.)

2 రంగము :—సభాభవనము.

[కంసుఁడు శంఖుఁడు ప్రవేశించెదరు.]

కంసు—తమ్ముఁడా! నాయొక్కని తుచ్ఛములైన ప్రాణములకొఱకై పూతన, శకటాసుర, తృణావర్త, బకాసుర, ధేనుకాసుర, వత్సాసుర, అఘాసుర, వృషభాసుర, ప్రలంబాసుర, కేశివ్యోమాసురాది మహావీరుల ప్రాణముల నా శ్రీకృష్ణహతకాగ్నిలో నాహుతి జేసితినిగదా!

శంఖు—అన్నయ్యా! అల్పబలు లెంతమంది చచ్చిన నేమి. మనఅక్రూరుఁడు బలరామకృష్ణుల దోడితెచ్చుటకు బోయియున్నవాఁడుగదా! అతఁడు కృష్ణుని నిటకునోడి తెచ్చును. నీవు వానిని వధించి పగ దీర్చుకొనఁగలవు. కావున నధైర్యమునొందకుము.

కంసు—ఎట్లు ధైర్య పడకుందునోయి.

ఉ. కంటకుఁడైన శాత్రవుఁడు కంసు నిరీక్షణ జేయుచుండ నా
కంటికి నిద్రవట్టునె సుఖంబుగఁ నోటికి నీళ్ళు పోవునే
తుంటరి కృష్ణుఁ డేడియ దుర్గును యుప్పుడు కాని నామనం
బంటునె ధైర్యలక్ష్మి యకటా మతివిభ్రమమయ్యె దమ్ముఁడా.

శంఖుఁడు—నీవింతయాలోచించుచుంటివి కాని యాకృష్ణుఁడక్రూరానీతుఁడై వచ్చి చాణూరముష్టికుల చేతగాని కువలయాపీడమను మత్తేభరాజమువలనఁగాని ప్రాణముల బాయఁగలఁడు. సందేహింపకుము.

[తెరలో]

కంసమహారాజా! చాణూరముష్టికులు సర్వసహా చక్రమును బాసి స్వర్గము జేరినారు. కువలయాపీడము కువలయమును బాసిపోయినది.

కంసు—ఓహో యీమాటలు [illegible]

అక్రూరుఁడు—(ప్రవేశించి) మహారాజా ఏమని చెప్పుదును. మీయాజ్ఞచే బలరామకృష్ణుల దోడితెచ్చినాను. వారు పురమున నేఁడు

పెట్టగనే రజకునిజంపి మీకుదెచ్చు దివ్యాంబరముల జేకొని నారు. సింగములవలె గర్జిల్లుచు నెదుర్కొనిన చాణూరముష్టికుల బరిమార్చినారు. ఇనుపరోకలిని గ్రహించి శిరంబులబగిల్చి చంపుటకు గాలదండమునుబోలిన తుండమునెత్తిన కువలయాపీడమును తృటిలో బీనుగును జేసినారు.

కంసు—ఆహా! అక్రూర! ఇకేమిగతి.

అక్రూరు—కంసమహారాజా! కృష్ణుడార్తరక్షకుడును కరుణారసమూర్తియు నగుటచే శరణన్నరక్షించునేమోయని తలంచెదను.

కంసు—ఛీ! ఛీ! అక్రూరుడా! ఎంతమాటపలికితివి.

మ. ననురక్షింపదలంచి బాంధవులు ర్నానా మిత్రులున్బోయి, గొల్లని వీర్యాగ్నిని బ్రాణముల్ దృణము లీ ర్లన్ గాల్చ నే నీధరిత్రిని నీతుచ్ఛపు బ్రాణికై విమతు బ్రార్థింపంగ మూఢుండనే మనప్రాణంబులు వెల్లమే విషసమం బార్స్నేహితుల్ ప్రాణముల్.

నీవు నాశత్రువును శరణనుమని చెప్పినావు గనుక నామ్రోలనుండి లేచి పొమ్ము.

అక్రూరు—ధన్యుడను. (నిష్క్రమించును.)

కంసు—తమ్ముడా! యిప్పుడాబలరామకృష్ణులెందున్నారో తెలిసికొనక వెడలిపొమ్మంటినే!

శంఖు—అన్నయ్యా వచ్చినవాడు నిన్నుజూడకయే పోవుననుకొంటివా! వారే బలరామకృష్ణులిట్లువచ్చుచున్నారు.

[బలరామకృష్ణులు ప్రవేశించెదరు.]

కృష్ణు—

శా. మామా! పూజ్యులబుందెలో నిడిన వారేర్నార్గ్యంబు నిన్నింకనున్
సేమంబొప్పగ నుంచెనే రిపుశిర ర్ఛేదంబు గావించితే

ఆమ్నాయాపరికల్పితంబగు ధను । ర్యాగ్రమం బేది ని
ష్కామున్ జేసి తరింపఁ జేయు నిను లో । కంబుల్మొదంబందఁగన్.

కంసు—ఓరీ కృష్ణ! ఆ ధనుర్యాగమునుగుఱించి తరువాత జెప్పెదనుగాని,

ఉ. దేవకికిం బుట్టగనె । దెబ్బున గ్రక్కునఁ బోయి యెవ్వఁడో
వావిరి నా యశోద యొసఁగి । పట్టున బెట్టగ యున్న నప్పుడే
జీవము బాసియుండు వటు । సేయక దేవకి నేవధించిన
న్నీవు జనింపగా గలుగుదే । యిది నాయపరాధమౌ గదా.

కృ—ఓరీ! కంస! అట్లు సేయుటకు నీవశమౌనని కొంటివా! ఒక వేళ నీవట్లుచేసితి వేని యేశత్వము నీకు మరణకారణమో అయ్యది రూపాంతరమున నిన్ను జంపకమానదు.

కంసు—ఓరీ! కృష్ణుడా! నన్ను జంపుటకు నేమిదోషమును జేసితినిరా!

కృ—నీవు! దేశద్రోహివి. లోకకంటకుడవు. అందువలన నిన్ను జంపి భూ భారమడంచుటకై నేనుపుట్టితిని.

కంసు—(తనలో) ఓహో యీకృష్ణు డర్భకునివలె నాకు ముందుగబొడసూపి యిప్పుడెంత జగద్భీకరమైన మూర్తివలె గనుపట్టుచున్నాడు! అయినను శరణంబని ప్రార్థించుటకు నామనంబు సమ్మతింపకున్నది. నలుగురు నవ్వుదురుగాక నేనిదెసబట్టి పారిపోవుదును. (పోబోవగా గృష్ణుడెదురువచ్చును. చూచి భయముతో) అక్కటా!

గీ. కృష్ణు యమునవంశభవుని రో । షిష్ణుజూచి
భయముచే దక్షిణాశకు । బరుగులెట్ట
నిందునుగూడ గృష్ణుడే । యెదురువచ్చె
నేమిసేయుదు దైవమా । యెందుజొత్తు.

అయినను పశ్చిమదిక్కుగా బారిపోయెదనుగాక! ముందుజూచి! ఓహో ఆశ్చర్యముగనున్నదే! యిదేమిమాయ చెప్పుమా!

చం. ఎనుటవసించె గృష్ణుడని ‌‌- యొంతయు భీతిలి దక్షిణాశకున్
బనపడిపారిపోవ హరి - భంగి నెదుర్కొని నంమగూడ నీ-
యుది తగదంచు నస్త్రగిరి - కేగగ జూచిన నంమగృష్ణుడే
యెదురుపడెన్ గదా గతి యి - కేది యొ నాకు లభించనయ్యెడున్.

అగుగాక ఉత్తరదిశాభిముఖుడనై పారిపోయెదనుగాక (నడచును. అంతను గృష్ణుడేయెదురుపడెను. చూచి) ఆహాహా! ఆశ్చర్యముకదా.

ఉ. ప్రాణభయంబుచే దక్షిను - బాసి,యుదీచికి బారిపోవ నా
ప్రాణముదీతునంచు యదు - వంశజకృష్ణుడు ముష్టిసాచి దృ
క్కోణము లెఱ్ఱజేసి నది - గో! చనుదెంచు మనుండె నన్ బరి
త్రాణముజేయ నెవ్వ నెఱు - దాత యొనందుకలండొ దైవమా.

అకటా! యికేమిసేయుదును.

శా. ఎందుంజూచిన కృష్ణశాత్రవుని రూ - పేకన్నులందోచెనే
మందు న్నింటికిబోదునా (పైకిజూచి) కటకటా - ఆకాశముంగూడ గో
విందాకారులచేత నొప్పెగద యీ - విశ్వంబునన్ డాగ జో
టెందున్ గానను నన్ను బ్రోవగల వా - డెందుండెనో దైవమా

కృ—ఓరీ! కంసా! నిన్నురక్షించినను భక్షించినను నేనేకాని నీకుదిక్కు వేఱులేదు. రారమ్ము. (కంసునిగ్రుద్ది పడవైచి గుండెలపై నెక్కి కూర్చుండును.)

శంఖుడు—(పారిపోవును.)

[అక్రూరనారదులు ప్రవేశించెదరు. పూలవానగురియును.]

అక్రూర—స్వామి జగద్రక్షక భూభారమడంగిపోయినది.

నారదు—యదువల్లభ శ్రీకృష్ణ! లోకకంటకుడైన కంసుడు నీచేదుంగినాడు. బలరామునిచే బ్రలంబాసురుడు వధింపబడినాడు. వసుంధరాదేవి కొంతభారముడిగి విశ్రాంతినిజెందినది. నీవా కంసుని విడచి యీవలకురమ్ము. నీకుభద్రమగును.

కృ—నారదమునీంద్ర! అటులే చేసెదను. (యాదవులకు వచ్చి) అక్రూర! నీవు పోయి యుగ్రసేనుని దోడ్కొనిరమ్ము. అతనికీ మథురానగర సామ్రాజ్యమును బట్టాభిషేకము జేసెదను.

అక్రూ—చిత్తము. (నిష్క్రమించి ఉగ్రసేనునితో బ్రవేశించును.)

కృ—ఉగ్రసేన! (కంసుని కిరీటమును దెచ్చి) నీవీమథురానగర సామ్రాజ్యమును సుఖముగ బాలించుకొనుము. నిన్నీ యాధిపత్యమున కభిషేకించినాను. అక్రూర! నీవితనికి సహకారివగుము.

ఉగ్ర—దేవా! మహాప్రసాదము.

అక్రూరు—చిత్తము.

నార—శ్రీకృష్ణభగవంత! నీనవతరించిన కార్యము కొంతవరకు సమాప్తి చేయబడినది. మరియు నింకేదియభీష్టమో తెలుపుము.

కృ—నారదమునీంద్ర! ఇంతవరకు గొంతదుష్టసంహారమైనది. అయిన నిట్లగుగాక.

మ. ఇలలో రాజ్యమదాంధత న్విడచి పృథ్వీశాలి పాలించుతన్
లలితోక్తుల్పచరించి కావ్యసతి ప్రాపలంజేయు చక్రావధా
నుల మాణిక్యకవీంద్ర సత్కృతులు మాన్యుల్మెచ్చ సర్వాంబులై
యలరుంగావుత యీవసుంధరకు గల్యాణంబు జేకూరుతన్.

నార—తథాస్తు.

స్వస్తిశ్రీ మహా మంగళమస్తు.

గద్య. ఇది శ్రీ కాశ్యపసగోత్రోద్భవ చక్రావధాని వంశపయః పారావారరాకాసుధాకర నారసింహార్యతనూభవ నరసమాంబా గర్భశుక్తి ముక్తాఫల వెంకట సుబ్బరాయ గురు కరుణాలబ్ధ సాహిత్య బుధజనవిధేయ మాణిక్యశర్మ విరచితమైన శ్రీకృష్ణలీలానాటకము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.



# కృష్ణలీలలోని సాంగ్సు



(1) సాంగు—కంసుడు అశరీరవాక్కు విని.

దేవగాంధారిరాగము, ఏకతాళము.

1. అహా యేమి యీ । విహాయసపురుడి । మహాభయంకర । మై మదినలచెను॥ అహా॥

భీషణమా! నుడిశిఖి । కే సమమా ! అశనికియేసమమా । నా సంహారకమా॥ ఎవ్వడురా! యీవసువ్రన నా । కొర్విర్వడంచు నని యీ సతిగర్భమటంచుబలికె॥ అహాయేమి॥

(2) సాంగు—దేవకిచంపవలదని కంసుని బ్రార్థించుట.

మోహనరాగము—ఆదితాళము.

1. తగునా ననుజంప । తరచగ నీకే చెల్లెలుగానా॥ తగునా॥

గగనాభాషాణములా । కై నన్ను జంపగమేలా । యే నిండు చూలాలిని । యోచింపుమామదిని॥ తగునా॥

2. సరివారలువిన మరియాదా! । సరియగు గుణగతి జనరాదా! । తరుగనట్టి పాపముకాదా! । హరినలచుచు దొలగగరాదా॥ త॥

(3) సాంగు—దేవకీవసుదేవులు చెరలో తపించుట.

డైలాగు—హనుమత్తోడిరాగము—ఏకతాళము.

వసుదే—హా చెలీ కడుసడుమల పాలైతిమిగా।ఏచతురుడు మనయాపద। లెల్లబాపజూచునొకొ॥ హాచెలీ॥

దేవకి—యేమిసేతునాథ గగన । వాణిపలుకు లింతజేసె । ప్రేమవీడి। కంసఖలా । దులు మనలా । నొంచెగదే॥

వసుదే—నారీ నీకన్నకొడుకు లారీతిని మడియ నొసట । వారిజసంభవుడు వ్రాసె । నేరీతిని దప్పగలదు॥

దేవకి—ఔవ మీ తీరుగా । సిరుమలా । నలచెగా॥

వసుదే—మదిని చింతబొందదగదు మనకు శ్రీనుడే॰ తి॥

ఇద్దరు—శ్రీ మా ధవా । శ్రితావనసును దాను మమ్ము । నేలవా కృపాలయా॥ హా॥ చెలీ॥

(4) సాంగు—దేవకీవసుదేవకంసుల డైలాగు.

శ్రీరాగము—ఏకతాళము.

దేవకి—ఓ గుణాభరణ । చనూ! శరణు । కుయూలించి ప్రోవవా కావవా । పసికూనబట్టి ప్రాణముదీయగదగునే ! యీయను చితకార్యముననను । శ్రేయమె రాజకులమునకు॥ ఓగుణా॥

కంసు—శ్రేయమో నాక । పాయమో లేక హేయమో । ప్రాణాపాయమో । యీయబలను విడతుననుచు । నెంచకు డికకలలోనన్ । మీ మాటలు చెల్లవు . నా యీకంసమృగేంద్రు మోల । మీ యబల నొసగి చనుడిక వేరాడక॥

వసుదే—ఔగ్రసేన నీవెఱుగని । న్యాయ మవనిలోనగలదె । ఆ పసిపిల్ల పుట్టెగదా! అనృతమయ్యెనింటిపల్కు॥

దేవకి—అరయగ నీబాల కోడ । లగునురా । సోదరా! చరణములను । బడుచుంటిని । కరుణింపుము॥ ఓగుణాభరణ॥

(5) సాంగు—కంస దేవకీవసుదేవుల డైలాగు సురటి—ఏక.

కంసు—ఓ అతివకరుణవిడచి । అబలనికన్ విడువుమా । విడువుమా । నాకు మృత్యువనుచు నెరిగి । యే కరణిద్యజించిపోదు॥ ఓఅతి॥

దేవకి—హా కంసా నాబిడ్డల । హతము సేయమేలటరా । నీకొడుకుల । కే యీగతి । చేకుర నీవెటులనెదో॥

వసుదే—కంసునేలదూరెదవే । కర్మమిటుల చేసెమనల । వ్యాకులపడ కీయబల నొసంగుమతివ॥ ఓఅతివ॥

(6) సాంగు—కంసుడు కృష్ణునితలచి ముఖారి—అటతాళం.

1. అదె మూఢ ప్రాణము నన్నుడాసి । నట్లుంత్రోచె నేమిసేతు । హృదయంబు చెదరె నేదిక్కు । యెదజొత్తు దమ్ముడా॥

2. పసికూనను జంపబోయి । యసురాంగనమడసె । కసిచే నను గూల్చజప । గలడేమోయకటా॥ అదె॥

(7) సాంగు—యశోద కృష్ణుడు అసురను జంపినందులకు.

కన్నడ—అటతాళము.

యశోద—ఇదియేమిచోద్యమమ్మ । ముదిత రాకాసియయ్యె । పాలీయ వచ్చి తన । ప్రాణము గోలుపోయె॥ ఇదియే॥

రోహిణి—అసుర బాలింతరూపము । నర్భకుజంపగవచ్చె । పసికూన పాలుద్రావి పట్టిప్రాణములదీసెను॥

యశోద—మనకృష్ణుడెంతవాడే । దనుజనుబట్టిచంప । తనపాపకర్మఫలమె । దానినిబట్టిచంపె॥

రోహిణి—ఇదియద్ధియని నిర్ణయింపగబాలము । యెవి యెటులైనా గానీ । కృష్ణుడు బ్రతికెగద॥ ఇదియే॥

(8) సాంగు-యశోదారోహిణులు గాలిచేచిక్కిన కృష్ణునికై తపించుట.

కాంభోజిరాగము—త్రిపుట.

యశోద—అమ్మో నాచిన్నికృష్ణు। నాసుడిగాలిగొంపోయె మింటికి॥అ॥ చయ్యనవచ్చికృష్ణ । సరగానాకీయరారే । సురలార॥అ॥

రోహి—చెల్లీ యశోదా నీవు ।తల్లాడిల్లబోకమ్మా । నీవదిరి॥ చెల్లీ॥ అల్లాదే మింటానుకా । పిల్లాడుబట్టి తెచ్చుచున్నాడు॥ చెల్లీ॥

యశోద—అక్కా! ఒకరక్కసుకొరము।గ్రక్కనచిట్ చేతులబిసుకుచు। అక్కజముగ క్రిందికీడ్వగను। మ్రుక్కడి పై కెగలాగుచును న్నాడు॥ఆ॥

హిరో—లేదేధైర్యముగానుమా కరి। వ్యాగని హీనుని జేయుచు మన। గాదిలి కృష్ణుడు త్రోసెవేచును। గాంచుదవె ఆకసమందున నీవు॥ చెల్లి॥

(9) సాంగు—బలరామకృష్ణుల క్రీడ. బిళహరి—అట.

కృష్ణు—1. ఆటలాడుదము వేగరారే। ఓఅన్నలార! ఓచిన్నలార!॥ ఆటా॥బూటాకములైనా। ఆటలుమనకేలా। హాయిరాకచేలు ని। యాటలాడుదమిపుడు॥ ఆటలాడు॥

2. మత్స్యమై నేను సో। మకుని దుంపగబోదు। వాత్స ల్యమున దివ్యవర్గము మిముబ్రోతు॥ ఆటాలా॥

3. మీరుపశువులుకండు। యేరక్షకుడనౌదు। గారవమున మిమ్ముగాతూ నీకోలాచే॥ ఆటాలా॥

4. బంతాటలాడంగ। బరుగున రారయ్య। పంతాముతో బంతి। నెంతాదూ రామేతురో ॥ఆటలా॥

(10) సాంగు—కృష్ణుడుయశోద డైలాగు. (వినుతసుగుణశీలవగుస.)

కృష్ణు—మన్నుదినగ లేదే నా। యన్నమాటవినకే॥ మన్ను॥

వెన్నలేదె మనయింటా। వెంగలి నేయమ్మా॥

యశో—బలరాముడు వట్టికల్ల। పల్కెడెపుడు నిజము। నీచిలిపిచేష్ట లెరుగుదాన చెప్పకుమిటురమ్ము। అన్నా! మన్నా! తినెద వీవుబీదకరణి। చెంతరారకృష్ణా! నీచేష్టలెల్ల దెలిసె॥ చెంత॥

కృష్ణు—ఉట్టిమీద బాలుపెరుగు । లుండవె యోతల్లీ । నీపట్టినైన నాకు గొఱితపట్టున కృపతల్లీ । వాదా! వినరాదా । ననునాదర మునబ్రోవుమమ్మా॥ మన్ను॥

యశోద—నోరుచూపుమన్నా నీ । నేరములేకున్నా । జల్ సారమైనవె న్నబెట్టి సాకుచునోయన్నా । రారా, దరి । రార నీ వరాల నోరువిప్పరా॥ చోతరా॥

(11) సాంగు—యశోదకృష్ణుని భగవంతునిగా స్తుతించుట.

కళ్యాణి—రూపకము.

1. నీవే యీసచరాచర । జీవకోటికాధారము॥ నీవే॥
యీవిశ్వంబెల్లనేను । హృదయమందు నెప్పారెను॥ నీవే॥

2. నీదహరాకాశంబున । నీదిక్కులుగ్రహము లంతా । నీపదునాల్గు భువనములు । చూపట్టెను విశ్వమయుడ॥ నీవే॥

3. నాచిరపుణ్యముచేగన । నోచితి నినుబుత్రునిగా । బ్రోచిచందురి గాంచినగతి । రాజిల్లితి నీవలనను॥ నీవే॥

4. వందనమో బృందారక । వందితపదపంకజాత । నందనుడవు కావు జగ । న్నాధా నను బాలింపుము॥ నీవే॥

(12) సాంగు—గోపికలు కృష్ణునల్లరి చెప్పుట.

కమాచిరాగము—అటతాళము.

1. ఏమాని చెప్పుదుమే । కృష్ణునియల్లరి॥ యేమాని॥
యిల్లిల్లువెదకి పా । లెల్లామాగడమెక్కి । పిల్లలపైబడునే॥ తల్లీ॥

2. పిల్లాలబుట్టింతు । బల్లవాధరియన్ని కు । చ్చెళ్ళువీడాలాగనే । యశోదమ్మా॥ ఏమాని॥

3. చక్కగానున్నావె సకియా నీమోమంచు। గ్రక్కునముద్దాడెనే
నన్ను నీకొమరుకు॥ గ్రక్కున॥

4. మొదూజూచిన కృష్ణు। చందమేకనుపించు। మందుమాయల
వాడే॥ యశోదమ్మా॥

(13) యశోద కృష్ణుని మందలించుట ద్విపదలాగు.

దర్బారురాగము—అటతాళం.

యశోద—ఇదియేమి అల్లరిరాకృష్ణా! యెవరైనవిన్న నవ్వారటర॥ ఇది॥
మదిరాక్షులెల్లఁగూడి నీయెడ। మానకదోషమునిల్పిరి॥
ఇదియే॥

కృష్ణు—నమ్మబోకుమమ్మా యీ। నాలిముచ్చువారిమాటలు। అమ్మ
రో నే వీరియిండ్ల। నల్లరిచేసి యెరుంగనె॥ నమ్మ॥

చంద్రి—బొంకెదవటరాకృష్ణా। పంకజాక్షిపైనబడవె। శంకలేదురా
రమ్మని। సంతానము కలుగుననుచు॥ బొంకె॥

యశోద—నేరమేమిలేక నీపయి। నెలతలు కల్పనసేతురె। జారబుద్ధి
యేలరా! కృష్ణా! రవ్వలపాలైయెదె॥ ఇదియే॥

కృష్ణు—పల్లవాధరి నన్నుబిలచి। మెల్లనగౌగిటజేర్చెనె। చంద్రివదన
ముద్దులాడి। చాలుపొమ్మని ననుదోలెనె॥ పల్ల॥

చంద్రి—యెట్లుబుద్ధిచెప్పెదవో। యిల్లువిడచి పోవవలసె। చట్లపాలు
పెరుగువెన్న। చక్కగ దొంగిలిపోయెను॥ ఇదియే॥

(14) సాంగు—యశోద కృష్ణుని దండించుట.

జంగాల్ రాగము—ఏకతాళము.

యశో—రారాకృష్ణా! రా దండించెద। రామలజోలికి పోకుండా
కృష్ణు—రానే తల్లీ। రాపిడియేలనె। రామలనే దండింపగదే।

యశో—పూర్వుబోఁడ్లయిఁడ్ల కీర్తి పోవకుందువే ।

కృష్ణు—బోట్లునన్ను నంటకుండ బుద్ధి చెప్పవమా ।

యశో—అల్లరియా

కృష్ణు—కల్లసుమీ

యశో—బోటులతో స । య్యాటముమానగ । రోటికిగట్టెద రాకృష్ణా!

కృష్ణు—బోటులమాటలు । బూటకములు నీ । యాటోపంబిక మానగదే.

(15) సాంగు—చంద్రవదన కృష్ణుని వెతకుట.

ఆఠాణా—రూపకము.

ఎందుదాగియున్నావో । కందర్పసమానకృష్ణా॥ యెందు॥
సుందరాంగు లెల్లసీదు । పొందుగోరి యరుదెంచిరి॥ యెందు॥
సరసామృత మొలికెడు నీ । మురళీరవమాధురిచే । విరహామా
పలేక కల్కు । లరుదెంచిరి నిన్నుగూడ । ఓ దయాకరబిరాన ।
సాదరమున గాంచి । వరకేళిసుఖమొసంగి పాలింపగ రాదె
కృష్ణ! ॥ యెందు॥



